## 26 వ పేజీలో చివర పద్యం పాఠాంతరం

చ. కమనుఁడు రాక తక్కెఁ, బెఱకాంతకుఁ జిక్కెనోయంచు, బిట్టులోఁ
గుములుచుఁ, బృచ్ఛసేయ కళికకూటమి సిగ్గున; భీతిచేత మా
ర్గము దెసఁజూడ, కూర్చుకయ ఱ గాఢముగాఁ; దనగండపాళి స
బ్రిముగ వహించిమించె; దరశపక్వసుకందక పాండురచ్ఛవిఁ.

అప్పణ్ణా గ్రంథమాల. చతుర్థ ప్రచురణము.

ఓం.

శ్రీ మాత్రే నమః.

# రసమంజరి

అమరవాది నీలకంఠ సోమయాజిచే

రచియింపఁబడినది

మొదటికూర్పు 500 ప్రతులు

బెజవాడ: ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
అ. వెంకటరత్నం, M. Sc. గారిచే ముద్రింపఁబడియె, 1945.



వెల రు 1—8—0

# మనవి



ఈ రసమంజరి గ్రంథమును నేననువదించి దీనిని బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రి శతావధానిగారికి వినిపించు తలఁపున తాము సన్నిధి కరిగి వారికి నామూలాగ్రముగ వినిపించితిని. అప్పుడు శ్రీశాస్త్రి గారీ గ్రంథము నిదివరలోఁ బూర్వు లనువదించిరనియు నయ్యవి తాము స్వయముగఁ దిలకించితి మనియు సెలవిచ్చిరి. అంత నేనీ గ్రంథము నచ్చువేయించు ప్రయత్నమును విరమింతుననఁగ వారు "విరమింప వలదుగాని దీనిని మరల రెండు మూఁడావృత్తులు శ్రద్ధగాఁ బరిశీలించి చూచుకొని ముద్రింపుమని" సెలవిచ్చిరి. అదిగాక మద్గురువరేణ్యులగు బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారును బ్రహ్మశ్రీ శ్రీమాన్ విద్వాన్ కొరుకొండభట్టర్ వెంకట కృష్ణమాచార్యులుగారును, బ్రహ్మశ్రీ మక్కపాటి వేంకటరత్నకవిగారు మున్నగు మఱికొందఱు మిత్రులును, ముద్రణమునకుఁ బ్రోత్సహించిరి. అందుచే దీనిని ముద్రించితిని. ఇందుఁ గల గుణాగుణములను బండిత వర్యులు విమర్శించి నా కెఱింగించినఁ బునర్ముద్రణమున సవరించుకొందును. నా గ్రంథమును శ్రద్ధతో విని విమర్శించిన మద్గురువరేణ్యులగు బ్రహ్మశ్రీ శతావధాని వెంకటశాస్త్రి గారికిని బ్రహ్మశ్రీ వేమూరి సీతారాశాస్త్రి గారికిని నమస్కార సహస్రము లర్పించుచున్నాను. ఈ గ్రంథమును జక్కఁగఁ బరిశీలించి శ్రద్ధతోఁ బీఠికవ్రాసి యొసంగిన వైయాకరణ భూషణేత్యాది బిరుదాంకితులగు తాడేపల్లి సాంబమూర్తిశాస్త్రిగారికి వందన సహస్రము లర్పించుచున్నాను; నాశక్తికి వంచన లేనటుల న, స, వ, పలను శ్రద్ధతో దిద్దితిని గాని యింకను నాభేదమంత విస్పష్టముగాఁ గనుపించుట లేదు, అదిగాక రేఫ శకట రేఫల ప్రమాదముండిన నుండవచ్చును గావున సందర్భానుసారముగఁ జదువరులు సవరించు కొందురుగాక యని ప్రార్థించుచున్నాఁడ.

ఇట్లు,

వినీత వశంవదుఁడు,

గ్రంథకర్త.



# కృతిప్రశంస

ఉ. విశ్వహితుండు దీక్షితుఁడు । విజ్ఞుఁడు తత్త్వపదభక్తుఁడౌచు వి
శ్వేశ్వరు తీర్థమాది సక । లేడ్యసుతీర్థములందుఁ గ్రుంకె లో
కేశ్వరి! యయ్యా దేవరకు । లీనుఁడు నాకును శిష్యుఁడైన రా
జేశ్వరరాయఁ డీకృతిని । నీమనవే నిరపేక్షవానికిన్.

ఉ. దాననఁజేసి యీకృతిని । దావకయాజ్ఞ శిరానఁ దాల్చి నే
వాని కొసంగినాఁడ నిర । వద్యసు కీర్తిని సంతరించి శ
ర్వాణి! కృతిన్, గృహీశ్వరుని, । భక్తుని నన్నును, బ్రోవుమమ్మ! నీ
మానితపాద పద్మములె । మాకు శరణ్యములై యొసంగుతన్.

ఇట్లు,
గ్రంథకర్త.

# కృతిపతివంశావళి

గీ. యవన భూజాను లేలుచున్నట్టి దేశ
మందెసఁగు నోరుగల్ ఖండ । లాంతరమున
మధిర నామకమగు నుపమండలమున
వఱలెడినిఁ గొర్లగూడెమన్ । పుర మొకండు.

గీ. ఆపురిం బెంపెసంగుదు । రనఘమంత్రి
వంశ్యులును । బావనులు భర । ద్వాజగోత్రు
లందు నన్నింటఁ బురుడు । లేకతులకీర్తి
నయ్యదేవర మహితాన్వ । యం బెలర్చు.

గీ. ఆమహావంశ మౌక్తిక । మై రహించె
వంశకరుఁడు పూజ్యుఁడు భగ । వత్ప్రపత్తి
మండితుండగు రామయా । మాత్యవరుఁడు
నాదుకృతిపతి ముత్తాత । నయవిదుండు.

ఉ. రామయమంత్రి వర్యుఁడుఁ గరమ్ము యశమ్ము గడించి మించుచున్.
ధీమహితాత్మ కోటమ నుదీర్ణచరిత్రను బెండ్లియాడె శ్రీ
రాములు వారికిం బాడమి । రాజిలెఁ బుణ్యఫలంబు గాఁగ ను
ద్దామ పరాక్రమాఢ్యుఁడయి । ధన్యజనాభినుతి ప్రశస్తుఁడై.

గీ. రామయాఖ్యుని సుతుఁడు శ్రీ । రామ మంత్రి
జనకునిన్ మించె స్వీయ స । చ్చరిత చేత
నగును దనయులు కతిపయు లధిగమింత్రు
జగమునం దండ్రిలను గుంభ । జన్మనట్లు.

గీ. మునుపు దశరథ వంశవర్ధనుఁడు రాముఁ
డర్మిలిని సీతను వివాహ । మైన భంగి
ఘనుఁడు శ్రీరాములును సీత । కరముఁబట్టె
జగతి జనులెల్ల రిది సమం । జసమనంగ.

క. ఆపుణ్యదంపతులకున్
శ్రీపతి కృపఁబుట్టెరామ । కృష్ణామాత్యుం
డాపన్న రక్షకుఁడు ని
ష్కాపట్యచరిత్రుఁడగుచు । జగములు మెచ్చన్.

గీ. ఆమహామాత్యు ననుఁగుటిల్లా లనంత
మాభిధకుఁ బుణ్యశీల నిత్యాన్నదాన
ధీరసంతాన దైవభక్తిప్రసక్తి
గలుగ రానాఁటిసతుల నిక్కముగఁ బురుడు.

ఉ. విశ్వజనీనులైన సువివేకులు వారల కుద్భవించి రా
యీశ్వరు సత్కృపాగరిమ నెంతయు రక్తినపత్య మాచురా
జేశ్వరరావు సద్గుణ విశిష్ట సుశీల కుమార్తె రాధయున్
శాశ్వతకీర్తి సంపద లెసంగుత వీరల కద్వితీయమై.

గీ. జగతి నన్వర్థ నామయై పొగడు గొనిన
సత్యవతి విదుషీమణి జాయ యయ్యె
నర్మిలిని మనరాజేశ్వరరాహ్వయునకుఁ
గలిగె వీరికిఁ జంద్రశేఖరుఁడు సుతుఁడు.

క. ఆచంద్రశేఖరాఖ్యుఁడ
నూచానకుల ప్రసూతను గ్రహియించెన్
శ్రీచరణ సేవనారత
యాచంద్రకళాకలాస్య ననసూయాంబన్.

గీ. శ్రీమదనసూయకును జంద్రశేఖరునకు
సుతుఁడు శ్రీరామకృష్ణుండు సుత లిరువురు
నిస్సమానులు శ్రీభవానియును సత్య
వతులు పొడమిరి నోముల ఫలము లనఁగ.

ఆశీస్సు

గీ. ప్రతిఫలాపేక్ష లేక సత్కృతి నొసంగు
మాన్యుఁడెవఁడైనఁ గల్గునే మహితలమున
ధన్యుఁడవు గావున నయాచితముగ లబ్ధ
మయ్యెఁ గృతిభర్తృపదము నీకయ్య దేవ
రాన్వవాయ రాజేశ్వరాహ్వాయ మనీషి.

గీ. భోగభాగ్యాయు రారోగ్య పుత్రపౌత్ర
గౌరవోదాత్త కీర్తులం గరము మెఱసి
వర్ధిలెదుఁగాక వీరల వంశమెల్ల
భంగి సంతత మాచంద్ర భాస్కరముగ.

# పీఠిక

రసమంజరి సంస్కృతమందు రచియించిన కవరేణ్యుఁడు భానుఁడు. ఈతనికి భాను దత్తుఁడు భానుమిశ్రుఁడు అనికూడ వ్యవహారము కలదు. తండ్రి గణేశ్వరుఁడు. దేశము విదేహము. కవిత్వము కులక్రమాగతము. ఇందుదాహరింపఁబడు పద్యములు స్వకృతములు అను నంశముల నీతుది శ్లోకము దెలుపుచున్నది.

"తాతోయస్య గణేశ్వరః కవికులాలంకార చూడామణి
ర్దేశోయస్యవిదర్భభూః............పద్యేన స్వకృతేన
తేనకవినా శ్రీభానునా యోజితా."

ఈ శ్లోకముచే నమరసుధాకారుఁడు భానుఁడు భట్టోజీదీక్షిత పుత్త్రుఁడగుటచే గణేశ్వరపుత్త్రుఁడగు భానుకవికి నాతనికి భేదమనుక్తమయినను గ్రాహ్యమగుచున్నది.

,,కర్ణ కల్పితరసాలమఁజరీ; పింజరీకృత కపోలమండలః''

అని గీత గోవిందమునందును నిందుకు నొకటే విధమునఁ గనుపట్టెడిని, ఇందునుగూర్చి చర్చించుట ఆవశ్యకమేయైనను విస్తరభీతిచే స్పృశించి విడిచితి. అలంకార శాస్త్రమున నిది యొకగ్రంథము, రసాది నిరూపణము కూడ నున్నను ముఖ్యముగా నాయికా నాయకులఁ గూర్చి బహువిశేషము లీగ్రంథమునఁ బ్రతిపాదితము లై యున్నవి. విద్యానాథుఁడు గూడ

,,సంక్షేపేణ నాయికా త్రివిధా ముగ్ధా మధ్యా ప్రౌఢాచేతి

అని నాయికా నాయకుల నెక్కుడుగా నిరూపింపలేదు.

,,ఉపకారకత్వాదలంకార స్సప్తమ మంగ మితి యాయావరీయః సకలవిద్యాస్థానైకాయతనం కావ్యం పంచదశం విద్యాస్థానమితి యాయావరీయః

ఇత్యాది గ్రంథమున నష్టాదశ విద్యలతో మఱికొన్నింటిని జేర్చునెడ రాజశేఖరుఁ డలంకారమునుగూడఁ జేర్చినాఁడు. జగన్నాథపండిత రాయలుఁగూడ నుత్ప్రేక్షాప్రకరణమున

,,స్వాతంత్ర్యేణాలంకారతంత్రస్య''

అనిఅలంకారమునకు స్వతంత్రశాస్త్రత్వమును బ్రతిపాదించినాఁడు. ఋక్ఛంద వ్యాకరణమున.

"ఇదమక్షరచ్ఛందః వర్ణశస్సమనుక్రాంతం బ్రహ్మ బృహస్పతయే ప్రోవాచ బృహస్పతిరింద్రా యేంద్రో భరద్వాజాయ భరద్వాజఋషిభ్యః ఋషయో బ్రాహ్మణేభ్యః తంఖల్విమమక్షర సమామ్నాయ ఇత్యాచక్షతే నభుక్త్వా నన క్తం ప్రబ్రూయాద్బ్రహ్మరాశిః"

అనివ్యాకరణ సంప్రదాయ పరంపరప్రతిపాదింపఁబడినట్లు కావ్యమీమాంస యందలంకార శాస్త్రసంప్రదాయ పరంపరగూడ

,,అథాతః కావ్యం మీమాంసయిష్యే.''

అని మొదలుపెట్టి శాస్త్ర ఫక్కికతో నిరూపింపఁ బడియున్నది. ఈ యలంకారశాస్త్రమునకు మూలమును విస్తరభీతిచే నిటప్రస్తావించుటలేదు. దీనికిఁ బ్రారంభము నాట్యశాస్త్రముతోడనని ప్రథమాధ్యాయమున భరతోక్తివలనఁ దెలియ నగుచున్నది. ఈవిషయము స్థలాంతరమున నుపపత్తులతో విచారింపఁదగును. ఈపాత్ర

మున విపులముగాఁ గొన్నివందలసంఖ్యతో నాయిక విభజించి నిరూపింపఁబడినది. ఈ సంస్కృత పద్యములు హృద్యములై "సద్యః పరనిర్వృతి" గలిగించుననుటది అనుభవ దూరముగాని స్వభావోక్తిదూరముగాని కాదు. అందువలన బాలురకుసైత మీగ్రంథము సులభసాధ్యమగునట్టుల ననువదించి తెలుఁగువారలకందఁజేసినవారలు శ్రీ అమరవాది నీలకంఠసోమయాజులుగారు. వీరితండ్రి కీ॥ శే॥ అమరవాది వెంకటప్పయజ్వలు. మారకశాస్త్రిగారు, మారక గ్రహానిర్ణయమున మిగుల దక్షులగుటచే వీరి కాబిరుదము వచ్చినట్లు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి జాతకచర్య ఆరోగ్యకామేశ్వరి లోనగు గ్రంథముల వలనఁ దెలిసినది. వీరితల్లినరసాంబా సోమపీథిని. వీరు త్రైలింగ బ్రాహ్మణులు విద్వాంసులు యజ్వలు సిద్ధాంతులు "పులికడుపున దోమపుట్టె"దను లోకోక్తిని సార్థకపఱచినవారు. వీరికిఁగలుగుసామర్థ్య మితరగ్రంథ పీఠిక వలన సువ్యక్తమగుచుండుటచే నద్దానినిట మరల వ్రాయుట పిష్టపేషణము చర్వితచర్వణము నగునను భీతి నావిషయమున శబ్దసంక్షే మొనర్చుచున్నాను. వేయునేల? ఆంగ్లముననేమి జ్యోతిషముననేమి యుభయభాషా కవిత్వముననేమి కర్మిష్ఠత్వముననేమి అతిథిపూజాది ధర్మములనేమి చెప్పికొనఁ దగుగొప్ప వ్యక్తులీసోమయాజులుగారు. ఈరసమంజరిని ననువదించినవారిలో ఆదిపూడిసురతాని కోదండపతి యొకఁడు. ఇతనిగ్రంథమే అచ్చుపడి యాంధ్రాలోచన గోచరమైనది, ఆదియుఁబ్రకృతము దొరకుటలేదు. మూలము ననుసరించినయల్పస్వాతంత్ర్యము సోమయాజులుగారిది. ఎక్కుడు స్వాతంత్ర్యము కోదండపతిది.

ఇఁక నొక యనువాదము వ్రాత ప్రతిలో నచ్చటెనుఁగునఁ జూచినట్లు జ్ఞాపకము. మఱియు ననేకానువాదములు మదరాసు ఓరియంటల్ లైబ్రరీయందుఁ దాళపత్రములలో నున్నట్లు మా శివరామశాస్త్రిగారు మున్నగువారివలన నిటీవల దెలియనగుచున్నది. ప్రకృతము అమరవాది సోమయాజులుగారను వదించిరి. శ్రీ హర్షుఁడెన్నో పర్యాయములు వ్రాసినట్లు విందుము. అదేమోకాని సోమయాజులుగారు అయిదు పర్యాయములు వ్రాసిరి, అది గొప్పగా మెచ్చుకోఁ దగినది. నేనుగూడ ననువదించితిని. మా యిరువుర యనువాదములు నీషద్వైషమ్యమున సమకాలికములే, ఇన్ని యనువాదములున్నట్లిటీవలఁ దెలియఁగా మా నవీనానువాద మెందుకా? యని నాకు నేను బ్రశ్నించుకొని రామకథ నెందఱెన్ని విధముల వ్రాయలేదు. కాళిదాస శాకుంతల మెందఱెన్ని విధముల ననువదింపలేదని నామనమునకు నేనే సమాధానముఁ జెప్పుకొంటిని. వీరి యనుకరణమునకు నాయను కరణమున కున్న మార్పేమనఁగా? వీరు శ్లోక విషయమును దీసికొని స్వతంత్రరచనవలె హృద్యముగా ననువదించిరి. నేను వీలగునంతలో నా విషయను: పదములు, వచనములు సైత మద నెఱింగి యనువదించితిని. ఉదాహరణము.

శ్లో॥ వాసస్తదేవ వపుషో వలయం తదేవ
హస్తస్యసైవ జఘనస్య చ రత్నకాంచీ
కట్టు బుట్టంబుఁ జేతికంకణము రత్న
కాంచి యుం దొంటివే, (సోమయాజులుగారి అనువాదము)
ఒడలి వలువయదే చేతికడియ మదియె
మొలను రవ్వల మొలత్రాడు మునుపటిదియె. (నాయనుకరణము)

ఇట ,,తదేవ'' అనుదాని ననేకపర్యాయము లనువదించిన నాకు వారికి మార్పు చూడనగును, ఇట్లగుటవలన సోమయాజులుగారి రచనలో స్వాతంత్ర్యముచేఁ గొంత శయ్యా కవకాశముగలుగును. ఇదివినయోక్తియ'న నేనద్దానికిబాధ్యుఁడనుగాను. ఇంకొక యుదాహరణము.

‚నఖక్షతమురస్థలేఽధరతలే రదస్య వ్రణం
చ్యుతా వకుళమాలికా విగళితాచ ముక్తావళిః
రతాన్తసమయే మయా సకల మేత దాలోకితం
స్మృతిః క్వచ రతిః క్వచక్వచ తవాఽళి? శిక్షావిధిః
ఉరమున గోటినొక్కు నధరోష్ఠమునందునఁ బంటిగంటులున్
దొరగిన కేసర స్రజము గ్రుంగి కలంగిన ముత్యపుం సరుల్
సురతమునంతమందుఁ గనఁజొప్పడెఁ గా కనుభూతివేళ నే
నెఱుఁగదనుస్మృతిన్ రతిని నేని చెలీ! భవదుక్తి నేర్పియున్.

(సోమయాజులుగారిది)

ఉరమున గోటిరక్కు, నధరోష్ఠమునందునఁ బంటినొక్కు, న
త్తతిఁజ్యుతమైన యాపొగడదండయు నూడినయట్టి ముత్యముల్,
అరసితి నే రతాంతసమయమ్మున నియ్యవి యంతయున్ జెలీ'
స్మరణమదేడ యేడరతిమాట యదెక్కడ నీదు శిక్షయున్ (నాది)

ఇటవిూరొకఁడు గ్రహింపవలయును. కవులనుకొనకుండఁగనే యొకరి పదము లొకరి పద్యముఁబడవచ్చును. ఆ శైలిని మాత్రమే గ్రహింపఁదగును. అదిగాక ఇది అనుకరణమగుటచే నా శ్లోకమునందలి 'ఉరస్థల' అధరతల స్మృతి రతి మున్నగు పదముల గ్రహించి నంతమాత్రమున నొకరిదొకరు సంగ్రహించినట్లుగాదు. అన్యత్ర లోకము నందుఁ గూడఁ దెలియకుండఁగ నొకకవిపద్య మొకరికిఁ బడుట చాల మంది కవుల కనుభవదూరము కానిది. నా కుమారాభ్యుదయమున నొక పద్యము నీ మధ్య చూచు చుండఁగా నకస్మాత్తుగా తిరుపతి వెంకటేశ్వరకవుల మృచ్ఛకటికములో నల్పవ్యత్యాసమునఁ జాలవఱకున్నది, తీసి వేయుటకుఁ బ్రాణ మొప్పదు. ఏమిచేయుదును. ఇఁకను బ్రకృతమున నిట్టి మహాగ్రంథమును మూలదాఁగియున్న రత్నమును నిట్టి క్లిష్టపరిస్థితులలో వ్రాయుట గాక అచ్చువేయించి యాంధ్రుల కందఁజేసినందుకును,

“ఆ పరితోషాద్విదుషామని”

బావద్దకుఁ బ్రేమచే సంస్కరింపఁ జేయవచ్చినందుకును అందును నాబోటి వానిని,

,,మందః కవి యశఃప్రార్థీ''

అను శ్లోకమున కుదాహరణమైనవానిని బీఠిక వ్రాయఁ బ్రేరేచి నందుకును రసవత్ప్రబంధరచయితలగురసమంజ ర్యనువాదకులగు సోమయాజులుగారికి నే నెంత యును గృతజ్ఞుఁడనని విన్నవించుచున్నాఁడను.

‚జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః'

తాడేపల్లి సాంబమూర్తి శాస్త్రి,
సర్వతన్త్ర స్వతన్త్ర కళాశాల ప్రధానాచార్యులు (బెజవాడ)

# తొలిపలుకు

దీనిని సంస్కృతమున రచియించిన మహాకవి భానుమిశ్రుడు. ఇతని కవిత్వము చాలరసవంతమై తఱచు కైశికీవృత్తి కుదాహరణముగ నుండును. కేవల శృంగార రసోదాహరణముగ నుద్దేశింపఁబడిన యీరచనయందు, ఆరభట్యాది వృత్తులకు నవకాశమే యుండదని రసజ్ఞులకు వివరింపఁబనిలేదు.

,,కర్ణాటైః పరికల్పితేవ లలితా మాలా కవే ర్భారతీ''

అన్నాఁడు కాళిదాసు. ఈరచనయాతయు నీకాళిదాసోక్తికి నుదాహరణముగనే యుండును. యతి ప్రాసల బెడఁదలేని సంస్కృతమునందు రచన సాఁగినట్లు తెలుఁగు లో నెంతటి మహాకవికిని సాఁగదు. అందుచే మూలములోనున్నంత మృదుత్వము తెలిగించుటలోఁ గొండొకచో రావచ్చును. కాని కొండొకచో రాకపోయినను నయ్యది యాక్షేపణీయముకాదు. కేవల స్వతంత్రరచనయే యయినయెడల తెలుఁగు రచన సంస్కృతముకన్నను మిన్నగా నుండుననుట నిర్వివాదాంశము.

చ. వలఁబడియున్న జక్కవకవ బురణించుచు సన్నపైఁటలో
పల బిగి గుబ్బదోయి కనుబండువు సేయఁగ మోడ్పుఁజేతు లా
దలను ఘటించి మ్రొక్కిడి పదంపడి మెల్లనడాయఁబోయి తో
య్యలి విరిబంతిదోయిట నుపాయన మాయన కిచ్చి యిట్లనున్.
ఈపద్యములో "ఘటించి, ఉపాయనము" (సుదక్షిణాపరిణయము)

అను రెండుపదములు మాత్రమే తత్సమములు. తక్కినవెల్ల ,,నచ్చ తెలుఁగే'' ఆరెండుపదములలో నుపాయనము అనునది యచ్చతెనుఁగు పదమువలెనేయుండును. ప్రయత్నపూర్వకముగ నచ్చతెలుఁగులో రచనసాఁగించువారికి నిట్టి పాకము సంఘటింపదు. కాని యాదృచ్ఛికముగ రచియించువారలకు నక్కడక్కడ నిట్టిధోరణి నడచుచుండును, ఇది స్వతంత్ర రచన కాకపోవుటఁజేసి యిట్టిపద్యముల నుదాహరించి విమర్శింపవలసి యుండదు. ఇప్పటి యచ్చుప్రతులలోఁ గనుపడని స్వతంత్రపద్యములు కొన్ని నా విద్యార్థిదశలో నలుబదిసంవత్సరములనాఁడు రసమంజరి టీకలోఁజూచిన జ్ఞప్తికలదు. అం దొకటి యుదాహరించు చున్నాఁడను.

ఉ. అక్కరో! నీదువల్లభుఁ డహంకృతి చేసిన చేష్ట వింటివా?
యెక్కడ యెక్కడే; మఱియు నెవ్వరి నెవ్వరి; నన్నె నన్నె; నీ
వక్కడి కేల పోయితివి అంపినఁబోతిని గూడుమంటినా;
మ్రొక్కితి వేడుకొంటి నను ముట్టకు మంటి నిఁకేమిసేయుదున్.

ఈ పద్యము రచియించిన కవియెవఁడో తెలిసి కొనుట కవకాశములేదు కాని చాలమృదువుగా రచియింపఁదగిన వాఁడని మాత్రము పద్యమే చెప్పుచున్నది. కొందఱు బండ్లకొలఁది రచన సాఁగించియు.

,,లోకుల...రసనలె, యాకులుగాను:దునట్టి యవివో కవితల్''

అనువాటకు లక్ష్యముగా నుండఁదగిన పద్యమున కొక దానికిని నోచుకొనరు. కొందఱొరచియించినవి యొకటిరెండు పద్యములే యైనను నయ్యవి యెల్లరకుఁ గంఠపాఠముగ నుండు నట్లు రచియింతురు.

ఉ. ఏవనితల్ మముందలఁప • నేమిపనో? తమరాడువారు గా
రో? వలపింపఁగా నెఱుఁగ • రో? తమ కౌఁగిటిలోన నుండఁగా
రా వది యేమిరా విజయ•రాఘవ యంచిలుఁ దూరిబల్మిమై
దీవరకత్తెనై పెనఁగి • తీసుకవచ్చితి. నోతలోదరీ!

ఈ పద్యము సుమారు నూఱేండ్లకు మున్ను విజయనగర సంస్థానాధిపతికి నంపుడుకత్తెయైన యొక వేశ్య, వారి పట్టమహిషికి రచియించిపంపినట్లు కవిపరంపర చెప్పు కొనుచున్నది. కాని యిటీవల నిదిరచియించి నది తంజావూరు సంస్థానాధిపతి యుంపుడుకత్తె యని శిష్యుఁడు ప్రభాకరశాస్త్రి చెప్పఁగా వింటిని. భవతు. మొత్తము రచియించినది వేశ్య యనుట నిర్వివాదాంశము. అంతఃపురము తన్ను దూషించిన సందర్భములో దీని ప్రసక్తికలిగినట్లు పద్యమే చెప్పుచున్నది. గాన వివరణ మనావశ్యకము. విజయనగర సంస్థాన మందే యీ పద్యము పుట్టుట నిక్కమైనచో నీ వేశ్యయే కూచిమంచితిమ్మకవిగారి దర్శనమునకు వచ్చి యాయన యేమఱిపాటునో వారి యింటియెదుటి రావిచెట్టుక్రిందనున్న పెద్ద రాతిబండ మీఁదఁ గూర్చుండి యుండఁగాఁ గౌఁగిలించుకొనుటయు నమ్మహాకవి దద్దరిలి పెడమోమగుటయు సంతలో నామె.

చ. చతురులలోన నీవు కడు • జాణ వటంచును బిట్టు కౌఁగిలిం
చితి నిటు మాఱుమోము మిడఁగఁ • జెల్లునె యోరసికాగ్రగణ్య!

అని ప్రశ్నింపఁగా నమ్మహాకవి.

అద్భుతమగు రంగు బంగిరపు • బొంగరపుంగవరంగు లీన్గుచ
ద్వితయము బొమ్మ నాటి యదె పీఁపున దూసె నటంచుఁ జూచితిన్.

అని సయుక్తికముగ జవాబిచ్చుటయుఁ బిమ్మట నామె నీవు మహారసికాగ్రగణ్యుఁడవు కనుకనే రసికజనమనోభిరామ మను కావ్యమును రచియింపఁగలిగితివని యభినందించి భవత్కృతమగు గ్రంథము చదివినది మొదలు భవద్దర్శన మెపుడా యని యువ్విళ్లూరుచు నేటికి మా ప్రభువు కోటిఫలి స్నానమునకు దయచేయుచుండఁగా శ్రీవారితోఁ గూడ బయలుదేఱివచ్చి తమ దర్శనముచేసి కృతార్థురాల నైతినని యభినందించినట్లు చెప్పికొందురు. మొదటి పద్యము విషయమున; తంజావూరు సంస్థానమా విజయనగర సంస్థానమా! యని సందేహమున్నను, రెండవ పద్యము విషయమున నేవిధమైన సంశయమునులేదు. తంజావూరు సంస్థానములోఁ గూడ నొకవేశ్య కవయిత్రి యుండిన నుండుంగాక అంతమాత్రమున విజయనగర సంస్థానములో లేక పోవలసియుండదు. ఈ సందర్భము నేటికి నలుబదియేండ్లనాఁడు మేము మొగలితుర్రి సంస్థానమునకు వెళ్లినప్పుడు నచ్చట నొకతాటియాకుల పెద్ద సంపుటమువలనఁ గూడదృఢమైనది. ఆసంపుటములోఁ దపతీసంవరణ, మను నొక ప్రబంధమును విష్ణుభక్తిసుధా సాగరమను పేరుగల వేఱొక ప్రబంధమును వెరసి రెండు గ్రంథములుఁ కలవు. అందులో సుధాసాగరమను

వది రచియించినకవి విజయనగరసంస్థానాధిపతియే. పైనుదాహరించిన వేశ్య యమ్మవారి రాజునకు నుంపుడు కత్తెయే యని తెలిసికొనఁ గలిగితిమి.

„కాకస్య కతివా దంతాః" ప్రస్తుత విచార మింతతో నాఁపి
"ప్రకృతమనుసరామః"

ఈ రసమంజరిని జాలమంది యిదివఱకే యనువదించినట్లు శిష్యుఁడు చి॥ శివరామశాస్త్రి తాను మాచినట్లు గ్రంథకర్తకుఁ జెప్పియున్నాఁడఁట. అందులో: అది పూడి సురతాని కోదండపతి చాల స్వతంత్రముగా రచన సాఁగించినట్లు శ్రీ తాడేపల్లి సాంబమూర్తిశాస్త్రిగారి వలన వింటిని. ప్రస్తుత మనువదించుచున్న సోమయాజికీ రచన పూర్తియగువఱకును నితరులాంధ్రీకరించినట్లు తెలియదు. పిమ్మటఁ దెలిసి యీ పిష్టపేషణ మెందుకని నిరుత్సాహపడుటకు దీనిని విన్న కొందఱు మిత్రులను నేనును సహింపక ప్రోత్సహించుటచే నిద్దానిఁ బ్రకటించెను.

ఇందలి గుణాగుణములు రసజ్ఞులైన చదువరులే నిర్ణయింపవలయును గాని గ్రంథకర్త గురువునైన నేను నిర్ణయించుటలో విశేషములేదు. అదియునుంగాక సాంబమూర్తిశాస్త్రిగారు కొంతవఱకుఁ బరిశీలించి యున్నారు. కావున నేను వారితో నేకీభవించుచు గ్రంథకర్తయగు శిష్యునకు నిరామయారోగ్య భాగ్య వంశాభివృద్ధి ప్రభృతి శ్రేయస్సులు గలుగు నట్లాశీర్వదించుచు నిద్దానిని ముగించుచున్నాఁడను.

26-2-45
క్షీరసాగరం-బెజవాడ

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,
శ తా వ ధా ని.



# పండితాభిప్రాయములు

శ్రీమత్పరదేవతాయైనమః.

చ. సరసుఁడు పండితోత్తముఁడు సత్కవిచంద్రుఁ డుదారమూర్తి భా
వరస విశారదుం డమరవాదికులీనుఁడు దాంతమూర్తి శ్రీ
కరమతి నీ కంఠకవి గండఁడు సంగ్రహణంబొనర్చె నీ
సరసరసప్రసూనము లెసంగుతఁ బద్మ వికాసలీలలన్.

ఉ. నాయక లక్షణంబులను నామము చేసి మనీషిపద్ధతుల్
పాయక నాయికాప్రతతి బాగుగఁ దెల్పి రసస్వరూపము
ఖ్యాయతమా నలంకృతుల హారమునందు నమర్చి మించె వ
హ్వా! యని పండితోత్తములు ప్రస్తుతిసేయ జగద్ధితంబుగన్.

బెజవాడ,
ఆంధ్రగ్రంథాలయప్రెస్,
11—5—45,

ఇట్లు,
విద్వాన్ శతావధాని,
భమిడిపాటి అయ్యప్పశాస్త్రి,
(రిటైర్డుసీనియర్ తెలుఁగుపండిట్ బోర్డుహైస్కూల్స్, కృష్ణా).

---

శ్రీమత్పరదేవతాయై నమః.

సీ. బహుకామినీరత పరుఁడగు దక్షిణ
నాయకునకు రత్ననాలపేటి
ఏకపత్నీవ్రతాలోక నాసంసక్తుఁ
డనుకూలునకు వరహాలకుప్ప
తన యకృత్యమునకుఁ దరుణి కోపింప మా
ఱని ధృష్టునకు ముత్యాల సరము
ప్రియభామినీ మనోభీష్టతాసంసిద్ధి
పరుఁడైన శఠుని జవ్వాజి బరిణ

గీ. నాయికా నాయకులఁ గూర్చు నయమెఱుంగు
ప్రకట విట పీఠమర్ద చేటక విదూష
కసమితికిఁజూడ ముంజేతి కంకణమ్ము
గాఁగ రసమంజరీకృతి గ్రాలుఁగాత.

ఇట్లు బుధజనవిధేయుఁడు
శ్రీ దైవజ్ఞభూషణ, సరసకవిచంద్ర,
చల్లపల్లి లక్ష్మీనృసింహశాస్త్రి,
నడుపూరు అగ్రహారము, కృష్ణాజిల్లా.

మకాం-బెజవాడ,
ది 10-5-1945.

ఓం

శుభమస్తు. శ్రీ మాత్రే నమః. అవిఘ్నమస్తు.

# రసమంజరి



గీ. శ్రీనిధానంబు త్రిపురేశి * చిన్మయాంబ
మాతృకావర్ణ రూపిణి * మహితచరిత
లోకయాత్రావిధాయిని * లోకజనని
శ్రీ శివాఖ్యను యజియింతుఁ * జిత్తమందు.

గీ. చేయుదును సేవ తరుణేందు * శేఖరునకు
శరణమగుఁగాక గిరిరాజ * వరకుమారి
వారలిర్వురె శరణ మి * వ్వసుధ మరల
నంతకొండొక్క దైవంబు * నాత్మఁదలఁప.

శ్లో. ఆత్మీయం చరణం దధాతి పురతో నిమ్నోన్నతాయాం భువి
స్వీయే నైవ కరేణ కర్షతి తరోః పుష్పం శ్రమాశఙ్కయా
తల్పే కిం చ మృగత్వచా విరచితే నిద్రాతి భాగై ర్నిజై
రన్తఃప్రేమభరాలసాం ప్రియతమా మఙ్గే దధానో హరః.

చ. మనమునఁ బ్రేమభారపు శ్రమ౯ బడు ప్రేయసి మేనుపై ధరిం
చెను శ్రమయన్న శంకభువిఁజేర్చి స్వపాదమె యెచ్చుఁదగ్గు లం
దునఁ దన కేలితోఁ దరులఁద్రుంచి విరుల్ మృగచర్మశయ్యపైఁ
దనదగు భాగమందునన * దర్పకవైరి పరుండి నిద్రలె౯.

శ్లో. విద్వత్కులమనోభృఙ్గరసవ్యాసఙ్గహేతవే
ఏషా ప్రకాశ్యతే శ్రీమద్భానునా రసమఞ్జరీ.

గీ. పండిత నికాయమానస * భ్రమరచయము
రసముగ్రహియించి యానంద * రసనిమగ్న
మగుట కొఱకునై శ్రీమంతుఁ * డైనభానుఁ
డిదియ రసమంజరి నొనర్చె * నెసక మెసఁగ.

తత్రరసేషు శృఙ్గారస్యాభ్యర్హితత్వేన, తదాలమ్బన విభావత్వేన, నాయికా తావ న్నిరూప్యతే.

రసమంజరీ గ్రంథమందు; శృంగార, వీర, కరుణా, ద్భుతహాస్య, భయానక, భీభత్స, రౌద్రరసములలో, శృంగార రసము ప్రధానమైనది గావున ముందుగఁ; దదాలంబన విభావమగుటచేత నాయిక నిరూపింపఁబడుచున్నది.

సాచ త్రివిధా స్వీయా పరకీయా సామాన్యా చేతి, తత్రస్వామిన్యే వానురక్తా స్వీయా న-చపరిణీతాయాం పరగామిన్యామవ్యాప్తిః, అత్రపతివ్రతాయాఏవలక్ష్యత్వాత్, తస్యాశ్చపరగామితయా పరకీయాత్వ మపి సమాయాతి-అస్యాశ్చేష్టా-భర్తృశుశ్రూషా, శీలసంరక్షణ, మార్జవం క్షమా-చ- యథా

నాయికస్వీయయనియుఁ బరకీయ యనియు సామాన్యయనియు మూఁడువిధము లుగ నిర్ణయింపఁబడినది. పతియందే ప్రేమగలది స్వీయయనఁదగును. పరిణయమైన దయ్యును బరపురుషునియం దనురాగము గలదానిని స్వీయయనియనరాదు, పతివ్రత యగు నాయికకు మాత్రమే యీలక్షణముచెల్లును. వివాహితయైనను, పరపురుషాసక్తురాలయ్యేనేని దానికి పరకీయాత్వముతటస్థించును స్వీయాచేష్టలెవ్వియనఁగ దనపతిసేవఁ జేయుట, ఆభిజాత్య గౌరవాదులఁ గాపాడుకొనుట; మనోవాక్కాయములందేకరూప ముగానుండుట (భర్తయందే నిమగ్నమైన యనురాగము కలిగియుండుట) ఓర్పును గలిగి యుండుటయు నని యెఱుంగవలెను. ఎట్లనిన నుదాహరణమును జూపించుచున్నాఁడు.

శ్లో. గతాగత కుతూహలం నయనయో రపాఙ్గావధి
స్మితం కులనతభ్రువా మధర ఏవ విశ్రామ్యతి
వచః ప్రియతమ శ్రుతే రతిథిరేవ కోపక్రమః
కదాచిదపి చేత్ తదా మనసి కేవలం మజ్జతి

చ. సతతము రాకపోకల నెసంగు తలంపులమేర కన్గొనల్
స్మితమధరోష్ఠమందుననె చిప్పిలి విశ్రమ మందెడుఁ గృహా
గతుని విధాన నౌను నుడి కాంతుని వీనుల, కల్క యెప్పుడే
మతిఁ బొడమంగ మనంబుననె మ్రగ్గుఁ గులాంగన కప్పుడప్పుడే.

స్వీయాత్రివిధా, ముగ్ధా మధ్యా ప్రగల్భాచ. తత్రాఙ్కురితయౌవనాముగ్ధా సాచద్వివిధా జ్ఞాత యౌవనా అజ్ఞాత యౌవనా చేతి. సైవక్రమశోలజ్జాభయపరాధీనరతిర్న వోఢా, సైవసప్రశ్రయా.విస్రబ్ధనవోఢా, అస్యాశ్చేష్టాః క్రియాహ్రియామనోహరా కోపేఽపి మార్దవం నవభూషణేసమీహా.

స్వీయనుమరల ముగ్ధయనియు, మధ్యయనియుఁ బ్రగల్భయనియు ముత్తెఱంగుల విభజించినారని తెలియవలెను. 1 ముగ్ధయనఁగా మొలకెత్తినవయస్సు (యౌవనము) గలది. ఈముగ్ధ మరల రెండువిధములు జ్ఞాతయౌవన; (తనకు యౌవన

మంకురించినదను జ్ఞానముగలది) 2 అజ్ఞాతయావన (తనకుఁగల్గినయావన మెఱుఁగనిది). ఈముగ్ధయే క్రమక్రమముగ లజ్జాభయములకు లోఁబడిన మరుకేళిగలది నవోఢ. ఈనవోఢయే లజ్జాభయకంపాదులు వదలి నమ్మకముగలిగి వర్తించునది విస్రబ్ధనవోఢ ముగ్ధయొక్క చేష్టలెవ్వియన! లజ్జచేతహృద్యమయిన సంభోగ కాలికవ్యాపారము. కోపమునందు సయితము మెత్తఁదనము, క్రొత్తనగలను వస్త్రములను ధరించుటయందు కోరిక గలిగియుండుట.

సామాన్యముగా ముగ్ధకు, ఉదా.

శ్లో. ఆజ్ఞప్తం కిల కామదేవధరణీపాలేన కాలే శుభే
వస్తుం వాస్తువిధిం విధాస్యతి తనౌ తారుణ్యవేణీదృశః
దృష్ట్వా ఖఞ్జనచాతురీ ముఖరుచా సౌధాకరీ మాధురీ
వాచా కించ సుధాసముద్రలహరీ లావణ్య మామన్త్ర్యతే.

చ. ఇంతిమెఱుంగు మేన వసిఁయింపఁదలంచె మరుండు; తేనియా
స్వాంతమెఱింగి జవ్వనము ౘ వాస్తుసపర్య నొనర్ప దృక్కు ల
త్యంతము ఖంజనంబుగతి ౘ నైందవ మాధురి నాస్యకాంతి, యొ
క్కింత సుధాబ్ధి భంగరుచి ౘ నింతి నుడుల్ పిలువందొడంగెడిన్.

అజ్ఞాతయావనా యథా.

శ్లో. నీరాతీర ముపాగతా శ్రవణయోస్సీమ్ని స్ఫురన్నేత్రయో
శ్శ్యామం లగ్నమిదం కిముత్పలమితి జ్ఞాతుం కరం న్యస్యతి
శైవాలాఙ్కుర శఙ్కయా శశిముఖీ రోమావళిం ప్రోఞ్ఛతి
శ్రాన్తాఽస్మీతి ముహుస్సఖీ మవిదితశ్రోణీభరా పృచ్ఛతి.

మ. స్ఫురదక్షి శ్రవణాంత సీమఁగల నల్లన్ గల్వపూవంచు నా
నరయన్ బాణినిడున్ శ్రుతిన్ దరుణి దీర్ఘవ్యాత్తాలికన్ శైవలాం
కుర శంకన్ దుడుచున్ నితంబభరమున్ ౘ గుర్తింపకే మాటి కా
ళిరో, నేడస్సితి నంచుఁ బల్కు జలకేళిన్దీర్చి తీరస్థయై.

జ్ఞాతయావనకు, ఉదా.

శ్లో. స్వయంభూశ్శమ్భురమ్భోజలోచనే త్వత్పయోధరః
నఖేన కస్య ధన్యస్య చన్ద్రచూడో భవిష్యతి

గీ. అలస్వయంభువు శంభువు ౘ నయిన నీదు
చన్నుఁగవ యేమహాభాగ్యు ౘ శాతనఖము

వలనఁ జంద్రచూడమునయి ఽ వెలయఁగలదొ
తెలియనేరక యున్నాఁడ ఽ జలజనయన.

నవోఢకు, ఉదా.

శ్లో. హస్తే ధృతాఽపి శయనే వినివేశితాఽపి
క్రోడీకృతాఽపి యతతే బహిరేవ గన్తుమ్
జానీమహే నవవధూరథ తస్య వశ్యా
యః పారదం స్థిరయితుం క్షమతే కరేణ.

చ. కరమునఁ బేర్మిఁబట్టినను ఽ గమ్రపు సెజ్జకుఁ గూర్మిఁజేర్చి దా
నురమున నిల్పుకొన్నను నెదో మిష నావలికేగఁజూచుఁ బా
దరసముఁ జేతి నిల్పఁగల ఽ దక్షుఁడు దక్క మఱొక్కఁ డానవో
ఢరతి కనర్హుఁడంచు సుదృఢంబుగఁ జెప్పఁగవచ్చు నెమ్మెయిన్.

విస్రబ్ధనవోఢకు, ఉదా.

శ్లో. దరముకుళితనేత్రపాళి నీవీనియమితబాహుకృతోరుయుగ్మబన్ధమ్
కరకలితకుచస్థలం నవోఢా స్వపితిసమీపముపేత్య కస్య యూనః.

ఉ. ప్రాయపువానిడగ్గఱిరు ఽ వాణపునేత్రము లించుకంతఁదా
మూయుచు నీవినాథుకరకమ్ముఁలగియించి కృతోరుయుగ్మబం
ధాయతరైై మనోహరుని ఽ హస్తసరోరుహమ్ముఁ గుచద్వయిన్
బాయని యట్టులుంచుకొని ఽ స్వాపము చెందె నవోఢ వేడ్కమై.

సమానలజ్జా మదనా మధ్యా, ఏషైవాతిప్రశ్రయాదతివిస్రబ్ధనవోఢా, అస్యాశ్చేష్టా సాగసి ప్రేయసి ధైర్యవక్రోక్తిః అధైర్యే పరుషవాక్.

మన్మథవికారచేష్టలున్నూ లజ్జయు సమానముగఁగలది మధ్య, ఈ మధ్యయే మిక్కిలి నమ్మకముచే విస్రబ్ధనవోఢ యగును. మధ్య యొక్క చేష్ట లెవ్వి యన ధైర్యమున్నయెడల తనకహిత మొనర్చిన పతిని గుఱించి కపటవాక్యములఁబల్కుటయు నట్టి ధైర్యము లేకున్నఁ గఠినముగ మాటలాడుటయు, నని తెలియనగును.

మధ్యకు, ఉదా.

స్వాపే ప్రియాననవిలోకనహానిరేవ స్వాపచ్యుతౌ ప్రియకరగ్రహణప్రసఙ్గః
ఇత్థం సరోరుహముఖీ పరిచిన్తయన్తీ స్వాపం విధాతుమపి హాతుమపి ప్రపేదే

గీ. కనుటపోసఁగదు నిద్రింపఁ ఽ గాంతుమోము
మేలుకొనియున్ననాథుండు ఽ కేలనన్నుఁ

బట్టుకొనెడి ప్రశంసయే ప్రౌఢబలుననుచుఁ
గూర్కనఁట, కూర్కదఁట, గూడఁ గుసుమగంధి.

పరికల్భ

పతి మాత్రవిషయకేళికలాకలాపకోవిదాప్రగల్భా, వేశ్యాయాం కులటాయాం చ పతిమాత్ర విషయకత్వాభావాన్నాతివ్యాప్తిః అస్యాస్తు చేష్టారతి ప్రీతి, రానన్దాత్సమ్మోహః.

స్వీయవలెనే తన పతితోడనే సమస్తరతి సంబంధమగు వ్యాపారమునందు సమర్థత గల నాయికను ప్రగల్భయందురు. పణ్యాంగనయందును జారిణియందును నీ లక్షణము సమన్వయింప దేలయన, వేశ్యకు వివాహాదులు లేమింజేసి పతి నిర్ణయము లేదు. జారిణి స్వీయాలక్షణము నతిక్రమించి బహుభర్తృసక్తురాలగుటంజేసి స్వీయాత్వలక్షణము పట్టదు. గావునఁ బైనిఁ జెప్పఁబడిన ప్రగల్భా లక్షణమున కతివ్యాప్తిరానేరదు. ప్రగల్భచేష్ట లెవ్వియనఁ బతియందలి ప్రేమయు రతిజనితానందముచేఁ దన్మయతను జెంది మైమఱచుటయు నని యెఱుంగవలెను.

రతిప్రీతిమతికి; ఉదా.

శ్లో. సంస్పృశ్య స్తన మాకలయ్య వదనం సంశ్లిష్య కణ్ఠస్థలం
నిష్పీడ్యాధర బిమ్బ మమ్బర మపాకృష్య వ్యుదస్యాలకమ్
దేవస్యామ్బుజినీప తేస్సముదయం జిజ్ఞాసమానేప్రియే.
వామాక్షీ వసనాఞ్చలై శ్శ్రవణయో, ర్నీలోత్పలం నిహ్నుతే.

చ. స్తనముస్పృశించి, మోముగని సందిటఁ గంఠము గౌఁగిలించి పం
టను నధరంబునొక్కి వస నంబెడలించి, శిరోజపాశమం
త నెగయఁదోసి తత్తరముసనఁ బ్రియుఁ డంబుజినీ వరోదయం
బును నెఱుఁగందలంపఁజెలిశమూసె శ్రవః కుముదంబుఁ గొంగునన్.

సురతానంద సమ్మోహవతికి, ఉదా.

శ్లో. నఖక్షత మురస్థ్సలే ధరతలేరదస్యవ్రణం
చ్యుతావకుళమాలికా విగళితాచముక్తావళిః
రతాన్తసమయే మయా సకల మేత దాలోకితం
స్మృతిఃక్వచ రతిఃక్వచ క్వచతవాళిశిక్షావిధిః.

చ. ఉరమున గోటిగంటు లధరోష్ఠమునందు రదవ్రణంబులున్
దొరఁగిన కేసరస్రజము దృంగికలంగిన ముత్తెపున్ సరుల్
సురతమునంతమందుఁగనఁ జొప్పడెఁగా కనుభూతివేళ నే
నెఱుఁగ దనుస్మృతిన్ రతినినేని చెలీ! భవదుక్తినేనియున్.

## మధ్యాప్రగల్భల యవాంతరభేదములు

మధ్యాప్రగల్భే మానావస్థాయాం ప్రత్యేకం త్రివిధే, ధీరా అధీరా, ధీరా ధీరా చేతి. వ్యఙ్గ్యకోపప్రకాశికాధీరాధీరా ఇయాంస్తువిశేషః, మధ్యాయాస్తు ధీరాయాః కోపస్యగీర్వ్యఞ్జికా అధీరాయాః పరుషవాక్ ధీరాధీరాయా వచనరుదితే కోపప్రకాశకే ప్రౌఢాయాస్తు, ధీరాయా రత్యౌదాసీన్యమ్ అధీరాయా స్తర్జనతాడనాది, ధీరాధీరాయా రత్యౌదాసీన్యం తర్జనతాడనాది-చ, కోపస్యప్రకాశకమ్. ఏతేధీరాదిభేదాః స్వీయాయాఏవ న పరకీయాయా ఇతి ప్రాచీనలేఖన మాజ్ఞామాత్రమ్. యతోధీరత్వ మధీరత్వం తదుభయంహి మాననియతమ్ పరకీయాయాశ్చ మానశ్చేత్ తస్యాఅప్యా వశ్యకత్వాత్ మానశ్చ నపరకీయాయా ఇతివ్యక్తు మశక్యత్వాత్.

భర్త గావించిన యపరాధమువలనఁగోపము కలిగినప్పుడు ప్రగల్భయు; మధ్యయు; (ఇద్దఱునాయికలు) ధీరయనియు నధీరయనియు ధీరాధీరయనియు; మూఁడు విధముల వ్యవహరింపఁబడుదురు. 1 తనకుఁగలిగిన కోపమును మాటలచేఁగాక చేఁతలచేఁ (వ్యఙ్గ్యముగ) బ్రకాశింపఁజేయునది ధీర; 2 విస్పష్టముగఁబతి యెడఁదనకుఁగల్గిన కోపమును వెల్లడించునదిధీర 3 తనకుఁగల్గిన కోపమును గొంతవఱకుఁజేష్టల చేతను; కొంత వఱకు మాటలచేతను ప్రకాశమొనరించునది ధీరాధీర, అయితే మధ్యకుఁబ్రగల్భకుఁగల భేద మెద్దియనఁగ, మధ్యధీర, మధ్యాధీర, మధ్యధీరాధీరలలోఁ గొంచెము విశేషముగలదు 1 మధ్యధీరయొక్క కోపమును వాక్కు తెలుపును. 2 మధ్యాధీరయొక్క కోపముపరుష వాక్కులచేఁదెలియవలెను. 3 మధ్యధీరాధీరయొక్క కోపమును వచనరుదితములు దెలుపును.

1 ప్రౌఢధీరయొక్క కోపము రతియందుత్సాహము ప్రకటింపక యుదాసీనభావముగ నుండుటవలనఁదెలియనగును.

2 ప్రౌఢాధీరయొక్క కోపము పతిని బెదరించుట, కొట్టుట మొదలగుపనులచే గ్రహింపనగును.

3 ప్రౌఢధీరాధీరయొక్క కోపము తర్జనతాడనాదికంబుల వలనను రత్యౌదాసీన్యము వలనను నెఱుంగవలెను. ఈపైని వివరింపఁబడిన ధీరాదిభేదములు స్వీయా నాయికయందేగాని పరకీయలగు జారిణీవేశ్యలయం దనువర్తింపవని ప్రాచీన మతస్థు లభిప్రాయపడుట యాజ్ఞామాత్రమేగాని సహేతుకము కాదు. ఏలయన ధీరత్వాధీరత్వములు మానముతోడివి. పరకీయకును మానముకలుగవచ్చును కోపము కల్గినప్పుడే ధీరత్వాధీరత్వము లావశ్యకము లగుటచేతను మానముపరకీయలగు స్వైరిణీవేశ్యలకు గలుగదని నిర్వచించుటకు వీలులేనందువలనను పరకీయకు సైతము ధీరాధీర విభాగ మవసరమే యని రసమంజరీ కారకుని మతమైయున్నది.

## మధ్యాప్రగల్భల యవాంతరభేదములు.

### మధ్యధీరకు, ఉదా.

శ్లో. లోలాళిపుఞ్జే వ్రజతోనికుఞ్జే
స్ఫారా బభూవు శ్శ్రమవారిధారాః

దేహే సమీహే భవతో విధాతుం
ధీరం సమీరం నళినీదళేన.

గీ. చలదళివ్రాతమగు నికుంజమున నీవు
స్వేచ్ఛ విహరించు శ్రమఁబుట్టు స్వేదధార
లధికమగుచున్న వగుటచే నపనయింతు
తామరస దళధీర వాతములచేత.

మధ్యాధీరకు, ఉదా.

శ్లో. జాతస్తే నిశి జాగరో మమ పునర్నేత్రాంబుజే శోణిమా
నిష్పీతం భవతా మధుప్రవితతం వ్యాఘూర్ణితం మేమనః
భ్రామ్యద్భృఙ్గఘనే నికుఞ్జభవనే లబ్ధంత్వయా శ్రీఫలం
పఞ్చేషుః పునరేష మాం హుతవహ క్రూరైః శరైః కృన్తతి.

మ. నిదురింగాచితివీవు రేయి వినుమ న్నేత్రాంబులన్ రక్తిమల్
గదిరెన్ ద్రాగినవాఁడ వీవు మదిరన్ గాఢంబుగా మానసం
బదరెన్ నాకు భ్రమద్విరేఫఘనకుంజాంతంబునన్ శ్రీఫలం
బొదవెన్ నీకు సుమాస్త్రుఁడోర ననుబ్రక్కల్కొట్టాడు శస్త్రాగ్నులన్.

మధ్యధీరాధీరకు, ఉదా.

శ్లో. కాన్తానురాగ చతురోఽసి మనోహరోఽసి
నాథోఽసి కించ నవయౌవనభూషితోఽసి
ఇత్థంనిగద్య సుదృశా వదనే ప్రియస్య
నిశ్వస్య బాష్పకలుషితా నిహితా దృగన్తాః.

చ. వెరవరివౌదుస్త్రీల వలపింప మనోహరుఁడౌదు నాథుఁడౌ
దరయఁగ నంతెకాక నవయౌవనభూషితుఁడౌదువంచు సుం
దరియటు పల్కి-చూర్పుచు నిదానముగాఁ బ్రియుమోముదమ్మిని
ష్ఠురముగఁ గాంచెనశ్రులుసోనలు గట్టు దృగన్తపంక్తులన్.

ప్రగల్భధీరకు, ఉదా.

శ్లో. నోతల్పం భజసే నజల్పసి సుధాధారానుకారాగిరో,
దృక్పాతం కురుషేనవా పరిజనే కోపప్రకాశచ్ఛలాత్
ఇత్థం కైతకగర్భగౌరి దయితే కోపస్య సంగోపనం
తత్స్యాదేవ నచేత్ కుతస్సహచరీ కుర్వీత సాచిస్మితమ్.

చ. పరిజనతర్జనంపు మిషఁ ౯ బొన్పు భజింప వచ్చె సుధాధురీ
భరితవచస్సులన్ బలుకఁ ౯ బొల్పడ వారయఁబోవు కంటితో
సరిసరికోపగోపనము ౯ చాడ్పిది, కాదనఁ జేటి యేటి కి
త్తెఱఁగునమోముఁద్రిప్పినగుఁ? ౯ దెల్పుమ కైతకగర్భగాత్రిరో.

· ప్రౌఢాధీరకు, ఉదా.

శ్లో. ప్రతిఫలన మవేక్ష్య స్వీయమిన్దోః కలాయాం
హర శిరసి పరస్యావాస మాశఙ్కమానా
గిరిశ మచలకన్యా తర్జయామాస కమ్ప్ర
ప్రచలవలయవల్లత్కాన్తి భాజా కరేణ.

చ. పరశివ స్వస్వరూపము శశిప్రాకరురేఖనుగాంచి దాన నీ
శ్వరుని శిరంబునందుఁ బరభామ వసించె నటన్న శంకచేఁ
గరము వడంకునన్ గదలు ౯ కంకణ నిర్గతకాన్తి కాన్తమౌ
కరమునఁ దర్జనల్ సలిపె ౯ గట్టులతేని యనుంగు టల్లునిన్.

ప్రగల్భాధీరకు, ఉదా.

శ్లో. తల్పోపాన్త ముపేయుషి ప్రియతమే వక్రీకృతగ్రీవయా
కాకువ్యాకుల వాచి సాచిహసిత స్ఫూర్జత్కపోలశ్రియా
హస్తన్యస్తకరే పునర్మృగదృశా లాక్షారసక్షాళిత
ప్రోష్ఠీపృష్ఠమయూఖమాంసలరుచో విస్ఫారితా దృష్టయః.

మ. దరియన్ శయ్య మొగమ్ముద్రిప్పెఁ బలుకన్ గద్గదమ్ముగా సాచిహా
స్యరుచిన్ భాసిలు గండపాళి వెలసెన్ ౯ హస్తంబునన్ వేడ్కమై
గరముంపన్ బతి లక్కనీటఁ గడుగంగానొప్పు పాఠీనపృ
ష్ఠరుచిన్ మాంసలమైన ద్వగ్విసరమున్ ౯ సారించె మీనాక్షియున్

ధీరాది భేదములకు అవాంతర విభాగము

ఏతేధీరాదిభేదాష్షట్చ జ్యేష్ఠా, కనిష్ఠా, భేదాద్ద్వివిధాః పరిణీతత్వేసతి భర్తు రధికస్నేహా జ్యేష్ఠా, భర్తుర్న్యూనస్నేహా కనిష్ఠా భర్తురధికస్నేహాసు న్యూనస్నేహాసు పరకీయాసు సామాన్యవనితాసుచ నాతివ్యాప్తిః, పరిణీతపదేన వ్యావర్తనాత్.

మధ్య ప్రగల్భయను,భేదముచే నేర్పడిన యాఱుభేదములు గల ధీరాదినాయికలు జ్యేష్ఠయుఁ గనిష్ఠయు నను భేదముచేత పంద్రెండుగురు నాయికలైరి. వివాహితయై భర్త యొక్క యత్యంతానురాగమునకుఁ బాత్రమగునది జ్యేష్ఠ, పెండ్లియైనదియయ్యు భర్త

యొక్క యల్పస్నేహమునకుఁ బాత్రమగునది కనిష్ఠ. పరకీయయందును సామాన్య యందును బతికి నల్పాత్యంత ప్రేమలుండవచ్చును గాని వివాహ మనునది సామాన్య యగు వేశ్యకు లేమింజేసి సామాన్యయందును బరకీయాపద స్వారస్యముచే వివాహమై నప్పటికిఁ బరపురుషునకును, బరస్త్రీ పరకీయ యగును గావునఁ బరకీయయందును నీ జ్యేష్ఠా కనిష్ఠాలక్షణము చెల్లనేరదు. కావునఁ బరిణీతపదముచేఁ బరకీయా సామాన్యలను దొలఁగించినాఁడు.

జ్యేష్ఠధీరకును గనిష్ఠధీరకును, ఉదా.

శ్లో. ఏకస్మిన్ శయనే సరోరుహదృశో ర్విజ్ఞాయ నిద్రాంతయో
రేకాం పల్లవితావగుణ్ఠనపటా ముత్కంధరో దృష్టవాన్
అన్యస్యాస్సవిధం సమేత్య నిభృతం వ్యాలోలహస్తాఙ్గుళి
వ్యాపారై ర్వసనాఞ్చలం చపలయన్న్వాపచ్యుతిం క్షప్తవాన్.

మ. తరుణుల్ గూర్కిరి యొక్క సెజ్జ విభుఁడ ♦ ద్దానిన్ గ్రహించెన్ గనెన్
గరితన్ బల్లవితావగుణ్ఠనపటన్ ♦ గంఠంబుఁ బైకెత్తి; సుం
దరి వేఱొక్కతె మెల్ల డగ్గరుచు ను♦ద్వల్లోలహస్తాంగుళీ
సరసక్రీడఁ గదల్చి చీరచెఱఁగున్ ♦ సంవేశమున్ మానిచెన్

జ్యేష్ఠాధీరకును గనిష్ఠాధీరకును, ఉదా.

శ్లో. అన్తః కోపకషాయితే ప్రియతమే పశ్య న్ఘనే కాననే
పుష్పస్యాపచయాయ నమ్రవదనా మేకాం సమాయోజయన్
అర్ధోన్మీలితలోచనా ఞ్చల చమత్కారాభిరామాననాం
స్మేరార్ధాధర పల్లవాం నవవధూ మన్యాం సమాలిఙ్గతి.

మ. జనితక్రోధకషాయితాత్మలఁగనెన్ ♦ శాసించెఁ దాఁబూలఁదె
మ్మని దట్టంపువనాన నొక్కతెను స్మే♦రార్ధాధరోష్ఠప్రవా
ళను నంతర్గత రోషమీలితదృగా♦లంబిత్వీడా స్యాంబుజా
తను నన్యన్ బ్రియఁ గౌఁగిటందనిపె ము♦ద్వారాంనిధిన్ దేలుచున్.

జ్యేష్ఠధీరాధీరకును గనిష్ఠధీరాధీరకును, ఉదా.

శ్లో. ధైర్యాధైర్య పరిగ్రహగ్రహిళయో రేణీదృశోః ప్రీతయే
రత్నద్వన్ద్వ మన న్తకా న్తి రుచిరం ముష్టిద్వయే న్యస్తవాన్
ఏకస్యాఃకలయ న్కరే ప్రథమతో రత్నంపరస్యాః ప్రియో
హాస్తాహ స్తిమిషా త్స్పృశే న్కుచతటీ మానన్ద మావిన్దతి.

మ. స్థిరమాధైర్య మధైర్యముంగొనఁగ వ్రాసిం గన్న కాంతాద్వయిన్
మురిపింపన్ ధరియించె రెండుమణులన్ ముష్టిద్వయిన్ గాంతలి
ద్వర నొక్కర్తె కరంబుఁజేర్చి రతనం బున్ భర్తవేఁ బొక్క సుం
దరిపాలిండ్లు స్పృశించి సంతసిలె హస్తాహస్తి దంభంబునన్.

## పరకీయానిరూపణమ్.

అప్రకట పరపురుషానురాగా పరకీయా సాచద్వివిధా పరోఢా కన్యకాచ కన్యాయాః పిత్రాద్యధీనతయా పరకీయతా అస్యాగుప్తైవ చేష్టా.

తనహృదయమునందుఁగల యనురాగ మితరు లెఱుంగకుండునట్లుగ జారునియం దనురాగము గలది పరకీయ. అయ్యది రెండువిధములు. పరోఢయనియుఁ; గన్య యనియుఁ బతితో సంగమాది క్రియలాచరించుచు నితరునిచేఁ బ్రేమింపఁబడి జారిణియై తిరుగునది పరోఢ. వివాహము కాకమునుపు పరపురుషుని వరించి వానితో సంభోగశృంగారమా చరించునది, (రత్యాదికలాపము నిర్వర్తించునదికన్య) వివాహము కాకున్నను దలిదం డ్రులు మొదలగు పెద్దలయధీనమందున్న కారణమునఁ గన్యకుఁబరకీయత గలిగినది. ఈయపుచేష్టలు తనయం దనురాగవంతుఁడగు జారునికి మాత్రమే తెలియఁబడి యితరుల కెఱుకరాకుండఁగనుండును.

### పరోఢాయథా

శ్లో. అయం రేవాకుఞ్జః కుసుమశరసేవాసముచితః
సమీరో ఽయం వేలా వనవిదళదేలాపరిమళః
ఇయం ప్రావృడ్ధన్యా నవజలదవిన్యాసచతురా
పరాయత్తం చిత్తం సఖి కిమపి కర్తుం మృగయతే.

మ. స్మరసేవోచితనర్మదాతటనికుంజం బిద్ది వేలావనీ
స్ఫురదేలా సుపరీమళాత్తపృషదశ్వం బీతఁడొఁ గ్రొమ్మొయిల్
విరచింపందగు దక్షురాలయిన ప్రావృట్కాంత యీధన్య యి
త్తఱిఁజిత్తంబెదొచేయఁగా వెదకెడిన్ దన్వీ! పరాయత్తమై;

## గుప్తాదులు

గుప్తా విదగ్ధా లక్షితా కుల టాఽనుశయానా ముదితా ప్రభృతీనాం పరకీయాయా మేవాన్తర్భావః గుప్తాత్రివిధా వృత్త సురత గోపనా వర్తిష్యమాణసురత గోపనా వృత్తవర్తిష్యమాణ సురతగోపనాచేతి.

1 గుప్త = తన జారత్వమును బయల్పడనీయనిది.
2 విదగ్ధ = జారత్వమున నేర్పరితనముగలది.
3 లక్షిత = చెలికత్తెలు మొదలగు వారిచేఁ గనిపెట్టఁబడినది.
4 కులట = జారిణియై నిర్భయముగ జారులయిండ్ల కరుగునది.

5 అనుశయాన = తన జారత్వమునకుఁగలిగిన యంతరాయములకును దన కోరిక నెఱవేఱకుండుటకును దుఃఖించునది.

6 తన యిష్టము నెఱవేఱుట వలన సంతసించు చుండునది ముదిత.

1. మరల గుప్త ముత్తెఱంగులు.

(1) జరిగిన సురతమును దాఁచునది.

(2) జరుగఁబోవు సురతమును దాఁచునది,

(3) జరిగిన దానిని జరుగఁ బోవు దానిని (సురతమును) దాఁచునది.

త్రివిధా యథా.

శ్లో. శ్వశ్రూః కుర్విత్యతు విద్విషన్తు సుహృదో నిన్దన్తువా యాతర
స్తస్మిన్ కింతు నమన్దిరే సఖి పున స్స్వాపో విధేయో మయా
ఆఖో రాశ్రిమణాయ కోణకుహరా దుత్ఫాల మాతన్వతీ
మార్జారీ నఖరైః ఖరైః కృతవతీ కాం కాం న మే దుర్దశామ్.

మ. అలుకన్ జూపిన నత్త మాఱినను నన్నాతోడి కోడం డ్రికే
వల దూషించినఁ జేటికాపరితతియున్ బన్నుండ నాయింటిలో
నెలుకంబట్టఁగ నీబిడాలి వడిగా నిట్టట్టు కన్నంబురన్
జెలియా! దూకుచు వాఁడి గోళ్ళ నలిపెన్ జిత్రింబు లా దుర్దశల్.

విదగ్ధా ద్వివిధా = వాగ్విదగ్ధా క్రియావిదగ్ధాచేతి;
వాగ్విదగ్ధయనియుఁ గ్రియా విదగ్ధయనియు రెండు విధముల విదగ్ధ విభజింపఁబడినది.

వాగ్విదగ్ధా యథా

శ్లో. నిబిడతమతమాలవల్లి వల్లీ విచికిలరాజివిరాజితోపకణ్ఠే
పథిక? సముచిత స్తవాతితీవ్రే సవితరి తత్ర సరిత్తటే నివాసః.

గీ. భానుఁడతి తీక్ష్ణుఁడయి యేచుఁ బాంథ! నిబిడ
తమతమాల వినూత్నకుంజ దలతికాళి
విచికిలశ్రేణులనుగూడి వెల్గుచున్న
వాహినీతీర ముచితమౌ వాసమునకు

క్రియా విదగ్ధా యథా.

శ్లో. దాసాయ భవననాథే బదరీ మపనేతు మాదిశతి
హేమన్తే హరిణాక్షీ పయసి కుఠారం వినిక్షిపతి.

గీ. బదరికాచ్ఛేద మొనరింప భవననాథుఁ
డాజ్ఞ సేయంగ భృత్యున కద్దివినుచు

హరిణలోచన హేమంత \$ మగుటనీట
గొడ్డలిని బాఱవైచెను \$ గొంకుదక్క.

లక్షితా యథా

శ్లో. యద్భూతం తద్భూతం యద్భాయాత్ తదపి వా భూయాత్
యద్భవతి తద్భవతువా విఫల స్తవ కోఽపి గోపనాయాసః

గీ. జరుగఁ దగినదియంతయు ♦ జరిగెనుగద?
కావలసినది యింతతోఁ ♦గాకపోదు
జరుగుచున్నట్టి దానిని ♦ నలుపమాని
దాఁపవలెనన్న శ్రమము వ్య♦ర్థముగదమ్మ.

కులటా యథా

శ్లో. ఏతే వారికణాన్కిర న్తి పురుషాన్వర్షన్తి నామ్భోధరా
శ్శైలా శ్శాద్వలముద్వమన్తి నసృజన్త్యేతే పున ర్నాయకాన్
త్రైలోక్యే తరవః ఫలాని సుపతే, నైవారభన్తే విటా
న్ధాతః కాతర, మాలపామి కులటా హే తోఽస్త్వయాకింకృతమ్.

చ. చినుకులరాల్చు మేఘములు \$ చిమ్మవు పూరుషవర్ష ;మద్రులున్
గనవు విటాళి, శాద్వలని\$కాయములన్ గనుఁగాని; వృక్షముల్
గనెడిఫలంబులన్, విటులఁ \$ గల్పన సేయఁగ నేర వౌర! స్వై
రిణులకు ధాత?నీవు పొనరించిన మేలెది తెల్పు మ్రొక్కెదన్.

అనుశయాన

వర్తమానస్థానవిఘటనేన భావిస్థానాభావశఙ్కయా స్వానధిష్ఠితసఙ్కేతస్థలం ప్రతి భర్తృగమనానుమానేనచ అనుశయానాత్రివిధా.

నడచుచున్న సాంకేతిక స్థలమునకు భంగపాటొదవుటచేతను, ఇఁకముం దుచిత మగు సంకేతస్థలము దొరకదను భయముచేతను, సంకేతస్థలమునకుఁ దాను పోక భర్త మాత్రము పోయెనను నూహచేతను బశ్చాత్తాప పడునది; యని మూడు విధముల ననుశయాన విభజింపఁబడినది.

వర్తమానస్థాన విఘటనేన అనుశయానా యథా

శ్లో, సముపాగత వతి చైత్రే విగళతిపత్రేలవఙ్గలతికాయాః
సుదృశః కపోలపాళీ శివశివ తాళీదళద్యుతిం లేభే.

ప్రకృతము నడచుచున్న సంకేత స్థలమునకు హాని కలుగుటవలనఁ బశ్చాత్తాప పడుచున్న నాయిక కుదాహరణము.

గీ. చైత్రమాసమ్ము చనుదెంచెఁ ♦ బత్రచయము
పండి రాలంగఁ జొచ్చె ల♦వంగలతల
నందుచేఁ గపోలమ్ము తా♦టాకు కరణి
వెలవెలం బాఱె శివశివా ♦ వెలఁది కపుడు.

భావిస్థానాభావశఙ్కయాఽనుశయానా యథా

శ్లో. నిద్రాళు కేకి మిథునాని కపోతపోత
వ్యాధూత నూతన మహీరుహపల్లవాని
తత్రాఽపి తన్వి నవనాని కియన్తి సన్తి
ఖిద్యస్వ మా ప్రియతమస్య గృహం ప్రయాహి.

ఇఁకముందు సంకేతస్థలము దొరకదను శంకచేఁ బశ్చాత్తాపపడునది. దీని కుదాహరణము.

చ. ప్రియుని గృహాన కేగఁదగు ♦ వేదుఋనొందకు తన్వి! నీకటఁ
నయితము కూర్కు కేకి మిథు ♯ నంబులు గల్గి కపోతపోత సం
చయములచేఁ గదల్పఁబడుఁ ♦ జక్కనినూతనపల్లవంబు లెం
తయు నిగురొత్తువృక్షసము♦దాయములుండువనంబులుండవో.

తృతీయా యథా

శ్లో. కర్ణకల్పిత రసాలమఞ్జరీ పిఞ్జరీకృతకపోల మణ్డలః
నిష్పతన్నయన వారిధారయా రాధయా మురరిపు ర్నిరీక్ష్యతే

సంకేతస్థలమునకు భర్తయరిగి తానేగకపోయితినని పశ్చాత్తాపపడునాయిక కుదాహరణము.

గీ. తీయమావిపూ గుత్తి ♯ శ్రుతిని ధరించి
దానికాంతిఁ బింజరితమైఁ♦దనరుగండ
తలము గల్గు మురారిరా ♯ ధావధూటి
కనియెఁ గన్నీరు మున్నీరు ♦ గా స్రవింప.

ముదితా యథా

శ్లో. గోష్ఠేషు తిష్ఠతి పతి ర్బధిరా ననాన్దా
నేత్రద్వయస్య చ నపాటవ మస్తి యాతుః
ఇత్థం నిశమ్య తరుణీకుచకుమ్భ సీమ్ని
రోమాఞ్చ కఞ్చుక ముదఞ్చితమాతతాన.

గీ. వల్లభుఁడు పండుకొను గొడ్ల ♦ పాకయందు
గుడ్డిది ననాంద యిఁకఁ దోడి ♦ కోడ లంధు
రాలనుచు సఖి చెప్పిన ♦ రాజవదన
గుబ్బకవయందుఁ బులకలా ♦ గుబ్బతిల్లె.

కన్యాయథా

శ్లో. కిఞ్చిత్ కుఞ్చితహార యష్టి సరళభ్రూవల్లి సాచిస్మితం
ప్రాన్తభ్రాన్తవిలోచనద్యుతి భుజాపర్యస్త కర్ణోత్పలమ్
అఙ్గుళ్యా స్ఫురదఙ్గుళీయకరుచా కర్ణస్య కణ్డూయనం
కుర్వాణా, నృపకన్యకా సుకృతినం సవ్యాజ మాలోకతే.

మ. సరళభ్రూలత సాచిహాసము భుజా ♦ సన్నస్తంబు కర్ణోత్పలం
బరుదాకుంచితహారయష్టియు నపాం ♦ గాలోకమున్ గ్రాల నం
గరపున్ గాంతి వెలుంగు నంగుళిఁ జెవిన్ ♦ గండూతివారించుచున్
ధరణీశాత్మజ పుణ్యవంతునొకనిన్ ♦ దర్శించె వ్యాజమ్మునన్.

సామాన్యా నిరూపణమ్

విత్తమాత్రోపాధిక సకలపురుషానురాగా సామాన్యవనితా నన్వగ్నిమిత్రే క్షితిపతా వనురక్తాయా మిరావత్యా మవ్యాప్తిః తత్ర విత్తమాత్రోపాధే రభావాదితి చే న్నైవమ్ సాపి కాశ్మీరహీరాది దాతరి మహారాజేఽనురక్తా సతు మహార్హావితి తేనా వగమ్యతే విత్త మాత్రోపాధిరితి.

ద్రవ్యమందుఁ గలయాశచే నెల్లరను ప్రేమించునది సామాన్య స్త్రీ. దీనికి ధనమే ప్రధానముగాని తక్కిన విచారణతో నిమిత్తములేదు. అగ్నిమిత్రుఁడను రాజునం దనురాగము గలయిరావతియను స్త్రీ యందీలక్షణము పట్టదు. జాతిచే సామాన్యయయ్యును విత్తము ప్రధానముగాఁ గలది కాదు. గావునఁబై నుదాహరింపఁబడిన సామాన్యలక్షణ మద్దానియందు వర్తింపదని భావము. అనినచో నీ యిరావతియుఁ గుంకుమపువ్వు వజ్రములు మొదలగునవి యిచ్చు రాజును మాత్రమే ప్రేమించినదిగాని జడ దారిని వరింప లేదు. కావున సకల పురుషానురాగము కలది. కాకున్నను విత్తమాత్రోపాధికత్వము గలదేయగును. కావున నిదియు సామాన్య స్త్రీ యనియే పరిష్కరింపఁబడినది.

సామాన్యకు, ఉదా.

శ్లో. దృష్ట్వా ప్రాఙ్గణసన్నిధౌ బహుధనం దాతార మభ్యాగతం
వక్షోజౌ తనుతః పరస్పరహితాశ్లేషం కురఙ్గీదృశః
ఆనన్దాశ్రు పయాంసి ముఞ్చతి ముహుర్మాలామిషాత్ కున్తలో
దృష్టిః కించ ధనాగమం కథయితుం కర్ణాన్తికం గచ్ఛతి.

మ. అతివిత్తాఢ్యుఁడు దాత సుందరుఁడు నా ♦ నభ్యాగతుంగాంచి త
త్సతిపాలిండ్లు పరస్పర ప్రియపరి♦ష్వంగంబులన్ వర్తిలెన్
కుతుకాశూద్రిదకమట్టె పుష్పమిషచేఁ ♦ గుప్పించెఁగైశ్యం! బటన్
క్షితియుగ్మంబునుడాసె దృష్టి యితఁడిచ్చున్ దవ్యమెంతోయనన్

ప్రకారాంతరమున నాయికా భేదములు.

ఏతాః పున రన్యసమ్భోగదుఃఖితా వక్రోక్తిగర్వితా మానవత్యశ్చేతి త్రిస్రోభవన్తి.

స్వీయా, పరకీయా, సామాన్య లను నాయికలు మువ్వురు. మరల నన్యసంభోగ దుఃఖితయనియు వక్రోక్తి గర్వితయనియు మానవతియనియు మూఁడువిధముల విభజింపఁబడిరి.

అన్యసంభోగదుఃఖితా యథా

శ్లో. త్వందూతి నిరగాః కుఞ్జం నతు పాపీయసో గృహమ్
కింశుకాభరణం దేహే దృశ్యతే కథ మన్యథా

తన నాయకుఁడన్య స్త్రీతో సురతప్రక్రియ గావించినందుకై పరితపించు దాని కుదాహరణము.

గీ. ఏగితివి దూతిరో! పొద♦రింటి కీవు
పోవు పాపాత్ము నింటికిఁ ♦ బోవు దేని
కానుపించుట యెట్టులే ♦ మేనిపైని
కింశుకాభరణంబు లో♦కీరవాణి.

వక్రోక్తి గర్వితా ప్రేమగర్వితా సౌన్దర్యగర్వితాచేతి ద్వివిధా.

రెండవదియగు వక్రోక్తి గర్విత మరల రెండు విధములు. (1) ప్రేమగర్విత (2) సౌందర్యగర్విత.

ప్రేమగర్వితా యథా

శ్లో. వపుషి తవ తనోతి రత్నభూషాం
ప్రభు రితి ధన్యతమా௨సి కిం బ్రవీమి
సఖి తనునయనాన్తరాళభీరుః
కలయతి మే న విభూషణాని కాన్తః.

గీ. నీదుతనువున మణిభూష ♦ నెమ్మి విభుఁడు
తొడుగుఁగావున ధన్యవు ♦ ణోయజాక్షి?
దేహనేత్రాంతరమునకు ♦ దివులు వడుచుఁ
దొడవులను వల్లభుఁడు నాకుఁ ♦ దొడుగఁడెపుడు.

సౌన్దర్యగర్వితా యథా

శ్లో. కలయతి కమలోపమాన మక్ష్ణోః
ప్రథయతి వాచి సుధారసస్య సామ్యమ్
సఖి? కథయ కి మాచరామి కాన్తే
సమజని తత్ర సహిష్ణుతైవ దోషః.

గీ. దృక్కులకు నీ డొనర్చు నీరేజములను
పల్కుగమికిఁ బీయూషముగ బోల్కిసేయు
నిట్టులేవేవొ యుపమలు వెట్టు భర్త
చర్యలను సహించుటయె దోసమ్ముసుమ్ము.

మానవతీ భేదములు

వ. ప్రియాపరాధసూచికా చేష్టా మానః సచలఘుర్మధ్యమో గురుశ్చ అల్పాపనేయో లఘుః, కష్టాపనేయో మధ్యమః. కష్టతరాపనేయో గురుః. అసాధ్యస్తు రసాభాస ఏవ, అన్య స్త్రీ దర్శనాది జన్మాలఘుః, గోత్రస్ఖలనాది జన్మా మధ్యమః, అపర స్త్రీ సంగమజన్మాగురుః, అన్యథా సిద్ధకుతూహలా ద్యపనేయో లఘుః, అన్యథా వాదశపథాద్యపనేయో మధ్యమః, చరణపాతభూషణాద్యపనేయో గురుః

భర్త తన యెడలఁ గావించిన యపరాధమును సూచించు చేష్ట మానమనఁబడును. ఈ కోపము లఘుకోపము, గురుకోపము, మధ్యమకోపము, అని మూఁడు విధములు. స్వల్పయత్నముచే నపనయింపవీలైనది లఘువు. కష్టముచేఁ బోఁగొట్టఁజాలునది మధ్యమము. మిక్కిలి శ్రమపడి విశేషయత్నముచే నపనయింప వీలైనది గురుమానము ఎంతయత్నించినను నడుపఁబడఁ కాని మానము రసాభాసమే. పెఱతెరవఁగనుట మొదలగు వానిచేఁ బుట్టునది లఘువు. పొరఁబాటున నితర స్త్రీ నామమునఁ దన్నుఁ బిలుచుట వలనఁ గలిగినది మధ్యమము. అన్య స్త్రీ సంగమాది కారణములచే నుదయించినది గురుమానము. ఇతరవిషయములయందుఁ గుతూహలము పుట్టించి యుపశమింపఁజేయ వీలైన కోపము లఘువనఁబడును. నాయికను ప్రమాణములచేతను నసత్యాలాపములచేతను నూఱడింపవీలైనది మధ్యమము. నాయికకు వలయు భూషణముల నొసంగి కాని పాదములకు నమస్కరించి కాని యుపశమింపఁజేయ శక్యమయినది గురుమానము.

లఘుమానకు, ఉదా.

శ్లో. స్వేదామ్బుభిః క్వచన పిచ్ఛిల మఙ్గ మేత
చ్ఛాతోదరి క్వ చ న కణ్టకితం చకాస్తి
అన్యాం విలోకయతి భూషయతి ప్రియేఽపి
మానః క్వధాస్యతి పదం తవ తన్న విద్మః.

మ. సరసుండన్యను జూచినన్ మెయి విభూ♦షల్ పెట్టుచున్నన్ గృశో
దరి? నీమేనునఁ గొన్నిచోట్లఁ జెమటల్♦దట్టంబుగాఁ బుట్టఁగా
దె? రహించుఁ గద? కంటకాన్వితముగా♦దేహంబులోఁ గొంత కిం
కిరి కింకెక్కుడఁ దావొ?కాళ్నిలుపఁగా ♦ నేరంజుమీ? నెచ్చెలీ.

మ ధ్య మ మా న కు, ఉ దా.

శ్లో. యద్గోత్రి స్ఖలనం తత్రి భ్రిమో యది నమన్యసే
రోమాళివ్యాళ సంస్పర్శ శపథం తన్వి? కారయ.

గీ. పొరఁబడి మఱొక్కపేరునన్ ♦ దరుణి? నిన్నుఁ
బిలిచితిని గాని వేఱొండు ♦ తలఁపు గాదు
నమ్మకుండినయెడఁ బ్రమాణ మ్మొనర్తు
రమణి? నీదునూఁగారు సర్పమునుముట్టి.

గురుమానకు, ఉదా

శ్లో. దయితస్య నిరీక్ష్య ఫాలదేశం చరణాలక్తక పిఞ్జరం సపత్న్యాః
సుదృశో నయనస్య కోణభాసా శ్రుతిముక్తా శ్శిఖరోపమా బభూవుః.

గీ. సవతి చరణంపులత్తుక ♦ తవిలి యెఱ్ఱ
వడిన నాథులలాట మే♦ర్పడఁగఁజూచి
నట్టి కోమలిశాతదృ♦గంతరుచులఁ
జెవుల ముత్తెముల్ కెంపుల ♦ చెన్నువడసె.

ప్రథమ ప్రకరణము సమాప్తము.



# రసమంజరి

## ద్వితీయప్రకరణమ్

### అష్టవిధనాయికా నిరూపణమ్.

ఏతా ష్షోడశాప్యష్టాభి రవస్థాభిః ప్రత్యేకమష్టవిధాః, ప్రోషిత భర్తృకా, ఖణ్డితా, కలహాన్తరితా, విప్రలబ్ధా, ఉత్కణ్ఠితా, వాసకసజ్జా, స్వాధీనపతికా, అభిసారికా, చేతి గణనా ద్వష్టావింశత్యధికశతం భవన్తి. తాసాము ప్యుత్తమ మధ్యమాధమభేదగణనయా చతురధికాశీతి యుతశతత్రయం భేదా భవన్తి యత్త్వేతాసాం దివ్యాదివ్యోభయభేదగణనయా ద్విపఞ్చాశదధిక శతయుత సహస్రభేదా భవన్తి. దివ్యా ఇన్ద్రాణ్యాదయః, అదివ్యా మాలత్యాదయః, దివ్యాదివ్యా స్సీతాదయ ఇతి, తన్న, అవస్థా భేదేనైవ నాయికాభేదాత్ జాతిభేదేన భేదస్వీకారే నాయికానా మివ నాయకానా మప్యానన్త్యం స్యాత్. ఇన్ద్రాదయో దివ్యాః, అదివ్యామానవాః, దివ్యాదివ్యా అర్జునాదయ ఇతి యద్యపి ముగ్ధాయా ధీరాదిభేదాభావః, తథావిధ ప్రజ్ఞా సామగ్ర్యభావాత్, తథాష్టవిధత్వా భావోఽపి భవితుమర్హతి. తథాఽపి ప్రాచీనలేఖ నానురోధేన నవోఢా మప్యాల మ్బ్యైతే భేదా అవగన్తవ్యాః.

దేశాన్తరగతే భర్తరి సంతాపవ్యాకులా ప్రోషిత భర్తృకా. ఉత్కా-కలహాన్తరితా విప్రలబ్ధానాం పతి ర్దేశాన్తరగతో నభవతీతి న తత్రాతివ్యాప్తిః, అస్యాశ్చేష్టా దశావస్థాః.

ప్రాచీన సాంప్రదాయాను సారముగ నిర్వచింపఁబడిన పదునాలుగురు నాయికలును; నవస్థాభేదములచేతఁ బ్రత్యేకముగా మరల నెనిమిదివిధములుగా విభజింపఁబడిరి.

1 ప్రోషిత భర్తృక
2 ఖండిత
3 కలహాంతరిత
4 విప్రలబ్ధ
5 ఉత్కంఠిత
6 వాసకసజ్జిక
7 స్వాధీనపతిక
8 అభిసారిక

అని విభజింపఁగా నూటయిరువది యెన్మిది విధములగు నాయికలుగ వ్యవహరింపఁబడిరి, వీరిని మరల నుత్తమ, మధ్య, మాధమ భేదములచే 384 నాయికలుగ విభజించిరి, మరల వీరిని దివ్య, అదివ్య, దివ్యాదివ్యలను భేదములచే విభజింపఁగా 1152 నాయికలైరి.

శచీదేవి మొదలగువారు దివ్యలు, మాలతి మొదలగు వారదివ్యలు; సీతాదులు: దివ్యాదివ్యలు అనివ్యవహరింపఁ బడిరిగాని అట్లు వ్యవహరించుటసరికాదు. ఏలయనఁగ నవస్థా భేదముచే నాయికాభేదము వివక్షితము చేయఁబడినది గావున; జాతి భేదముచే వివక్షనంగీకరించు నెడల నాయికలకువలె నాయకులకును ననంత భేదము కల్పింపవలసివచ్చును. ఇంద్రాదులు దివ్యులు; మనుష్యు లదివ్యులు; అర్జునాదులు దివ్యాదివ్యులనని; అదిగాక ముగ్ధకు ధీరాదిభేదములులేవు. (అందుకు కావలసిన ప్రజ్ఞా సామగ్రి ముగ్ధయందుఁగానరామింజేసి:) కావున ముగ్ధానాయికకు, అష్టవిధనాయికాత్వముసైతముఁ జెప్పఁదగదు.

కాఁగాఁ బ్రాచీన మతసంప్రదాయాను సారముగ నవోఢ కీయష్టవిధనాయికాత్వము విభక్తు చేయఁబడెనని గ్రహింపవలయును.

1. ప్రోషితభర్తృక—

భర్త అన్యదేశమునకు వెళ్ళినపుడు విరహతాపానలముచేఁ దహించునది.

1 ఉత్కంఠిత
2 కలహాంతరిత
3 విప్రలబ్ధ
} వీరల పతి దేశాంతర గతుఁడు కానందున వారికి ప్రోషిత భర్తృకాలక్షణము సమన్వయింపదు.

ప్రోషిత భర్తృకయొక్క చేష్టలు దశావస్థలు.

ముగ్ధా ప్రోషిత భర్తృకా యథా

శ్లో. దుఃఖం దీర్ఘతరం వహత్యపి సఖీవర్గాయ నో భాషతే
శైవాలైః శ్శయనం సృజత్యపి పునశ్శేతే నవా లజ్జయా
కణ్ఠే గద్గదవాచ మఞ్చతి దృశా ధత్తే న బాష్పోదకం
సన్తాపం సహతే యదమ్బుజముఖీ తద్వేద చేతో భవః.

ఉ. సిగ్గునఁ జెప్పదెవ్వరును ♦ జేటులకున్, గురుదుఃఖవహ్నిలో
మ్రగ్గుచు నాఁచుపాన్పునొన♦రం బచరించియు మేనుదానిపై
నొగ్గదు కంట నీరిడ ద♦హో స్వరభంగ మొసంగుచున్నఁ దా
నగ్గజయాన తాప మెటు♦ లాఁగునొ? భావజుఁడే యెఱింగెడిన్.

మధ్యా ప్రోషితభర్తృకా యథా.

శ్లో. వాసస్తదేవ వపుషో వలయం తదేవ
హస్తస్య సైవ జఘనస్య చ రత్నకాఞ్చీ
వాచాలభృఙ్గసుభగే సురభౌ సమస్త
మద్యాధికం భవతి మే సఖి? కిన్నిదానమ్.

గీ. కట్టుఁ బుట్టంబుఁ జేతికంకణము రత్న
కాంచియున్ దొంటివే యేమి ♦ కారణంబొ?
సకల మయ్యది యధికమా ♦ సకియ? నేఁడు
మట్పు దారావ సుభగవ♦సంతమందు.

ప్రౌఢా ప్రోషిత భర్తృకా యథా

శ్లో. మాలా బాలాంబుజదళమయీ మౌక్తికీ హారయష్టిః
కాఞ్చీ యాతే పరిభవతి హారా సుభ్రువః పరిస్థితైవ

అన్యద్భ్రూభ్రమః కిమపి ధమనీ వర్తతేవా నవేతి
జ్ఞాతుం పాణౌ రహసా వలయం బాహుమూలం ప్రయాతి

మ. దనుజారాతి ప్రియాణమై చనఁగ నాకేతన్వంగి ముత్యాల పే
ర్లను లేఁదామర రేకుదండ ములనూకల్ జోయె; నింకొక్క టిన్
వినుమా; నాఁడు బ్రకోష్ఠ సీమఁగన కన్వేషింపఁగా నేగెఁ గాం
చనపుంగంకణ జాల మోలిమొయిఁ గక్షంపుంబ్రదేశానకున్

పరకీయా ప్రోషితభర్తృకా యథా

శ్లో. శ్వశ్రూః పద్మదళం దదాతి తదపి భ్రూసంజ్ఞయా గృహ్యతే
సద్యో మర్మరశంకయా నచ తయా సంస్పృశ్యతే పాణినా
యాతుర్వాచి సుహృద్గణస్య వచసా ప్రత్యుత్తరం దీయతే
శ్వాసః కించ న ముచ్యతే హుతవహాకూరః కురంగీదృశా.

ఉ. ఇత్తఱిఁ జేకఁగొన్న నిది ౯ యెండి ధ్వనించు నటన్న శంకచే
నత్త యొసంగు పద్మదళ ౯ మానకయే బూమనన్నఁ గొంచుఁ గిం
చిత్తును దోడికోడలికిఁ ౯ జెప్పక కాంత సఖీముఖాననే
యుత్తరమిచ్చి వేఁడియగు ౯ నూర్పుల వీడ కడంచె లోననే.

సామాన్యా ప్రోషిత భర్తృకా యథా.

శ్లో. విరహ విదిత మంతః ప్రేమ విజ్ఞాయకాంతః
పునరపి వసు తస్మా దేత్య మే దాస్యతీతి
మరిచనిచయ మక్ష్ణో ర్న్యస్య బాష్పోదబిందూన్
విసృజతి పురయోషి ద్ద్వారదేశోపవిష్టా.

చ. తనయెడఁ బాటుచేఁ బ్రకటి ౯ తంబగు నాహృదయంపుఁ బ్రేముడిన్
మనమున నెంచి వచ్చి యిడు ౯ నా చెలువుం డధికంబుగా ధనం
బని తలపోసి భోగిని గృ ౯ హాంగణమందునఁ గూరుచుండి తాఁ
గనుల మరీచగంధమును ౯ గాటుకగా నిడి వీడె నశ్రువుల్.

క్రమప్రాప్తా ఖండితా యథా

ఆన్యోపభోగ చిహ్నితః ప్రాతరాగచ్ఛతి పతి ర్యస్యాస్సా ఖండితా, ప్రాత రిత్యుపలక్షణం, అస్యాశ్చేష్టాః, అస్ఫుటాలాప చింతా సంతాప నిశ్వాస తూష్ణీం భావాశ్రుపాతాదయః

పరకాంతను బొందిన (సంభోగించిన) చిన్నెలు గలవాఁడై ప్రాతః కాలమున, నేయువిధకడను భర్తవచ్చునో యాయమ ఖండితానాయిక యనఁబడును. ఉదయ మనుట నితర సమయములకు నుపలక్షణము. అనఁగాఁ బ్రాతః కాలమునందే గాక యే వేళఁ యంద్రైనను సరియే యని భావము. ఈయమ చెయ్దిములు స్పష్టముగాని మాటయుఁ, జింత, సంతాపము, మౌనముఁదాల్చుట, నిట్టూర్పులు విడచుట, కన్నీరు గార్చుట మొదలగునవి.

ముగ్ధా ఖండితా యథా

శ్లో. వక్షః కిము కలశాంకిత మితి కిమపి ప్రష్టు మిచ్ఛంత్యాః
నయనే నవోఢ సుదృశః ప్రాణేశః పాణినా పిదధే.

గీ. ఏల? కలశంపుఁ జిన్నెల ౯ నెసఁగు వక్ష
మనుచు నేమియో పృచ్ఛసేయంగఁ దివురు
నా నవోఢ సుందరి నయ ౯ నాబ్జములను
బ్రాణనాథుండు మూసె సంభ్రమముతోడ.

మధ్యా ఖండితా యథా.

శ్లో. వక్షోజ చిహ్నిత మురో దయితస్య వీక్ష్య
దీర్ఘం న నిశ్వసితి జల్పతి నైవ కించిత్
ప్రాతర్జలేన వదనం పరిమార్జయంతీ
బాలా విలోచనజలాని తిరోదధాతి.

గీ. స్తనయుగాంకితదయితు ౯ వక్షముఁగాంచి
పలుకదింతయు నిట్టూర్పు ౯ వదల దింత
నమ్మికకువేకువ౯ మోముకదమ్మిఁగడుగు
నీటినెపమున మాటెఁగన్నీటి బోటి

ప్రౌఢా ఖండితా యథా

శ్లో. ప్రా ముద్వీక్ష్య విపక్షపక్ష్మలదృశః పాదాంబుజాలక్తకై
రాలిప్తానన మానతీకృతముఖీ చిత్రార్పితే వాభవత్
రూక్షం నోక్తవతీ నవాకృతవతీ నిశ్వాసకోష్ణే దృశౌ
ప్రాత ర్మజ్జళ మజ్జనా కరతలా దాదర్శ మాదర్శయత్.

చ. పరసతి కాలిలత్తుకలుకపర్విన నాదు మొగమ్ముఁ గాంచి సుం
దరి తల వాంచె చేష్టితముఁ ౯ దక్కి నిలంబడెఁ జిత్రమై ఖరి౯

బరుషము లాడలేదు పయిఁ శ్వాసకవోష్ణములైన చూడ్కులం
బఱపఁగ లేదు వేఁకువను ॥ మంగళ హా ముకురంబు ముందిడెన్.

పరకీయా ఖండితా యథా.

శ్లో. కాంతం నిరీక్ష్య వలయాంకిత కంఠదేశం
ముక్తా స్తయా పరభియా పరుషా న వాచః
దూతీ ముఖే మృగదృశా స్ఖలదశ్రుపూరా
దూరాత్పరం నిదధిరే నయనాంతపాతాః

చ. అరయుచుఁ బ్రాణనాథు వల ॥ యాంకిత కంఠతలంబుఁ గాంతతాఁ
బరుల భయమ్ముచేఁ బరుష ॥ వాక్కులనాడఁగఁ బోక ధారగాఁ
దొరఁగెడు నశ్రుపూరములఁ ॥ దోఁగిన దీన కటాక్షమాలికల్
పఱపెను దవ్వు దవ్వులఁ బ్రవర్తిలు దూతిక మోముదమ్ముపై

సామాన్యా ఖండితా యథా.

శ్లో. ఉర స్తవ పయోధరాంకిత మిదం కుతో మే క్షమా ?
తతో మమ నిధీయతాం వసు పురా యదంగీకృతమ్
ఇతి ప్రచలచేతసః ప్రియతమస్య వారస్త్రియా
క్వణత్కనకకంకణం కరతలా త్సమాకృష్యతే.

చ. ఉరము పయోధరాంకిత ॥ మహో! సహియించుట యెట్లొకొ? బల్
విరసుఁడవీవు మున్ననిన ॥ విత్తమునాకిడి యేగుమంచుఁ ద
త్తఱముఁ దారు కాంతు కయి ॥ దమ్ములనుండి రణన్మణిప్రభా
స్ఫురిత సువర్ణకంకణముఁ ॥ బుచ్చుకొనెన్ వెలకాంత బల్మిమై.

కలహాంతరితా యథా.

పతి మవమత్య పశ్చాత్పరితప్తా కలహాంతరితా, అస్యాశ్చేష్టాః భ్రాంతిసంతాప సమ్మోహ నిశ్వాస జ్వర ప్రలాపాదయః.

ప్రథమమున భర్తను దిరస్కరించి యవలఁ దన కావించిన తిరస్కారమునకు వగచునది కలహాంతరిత. ఈమె చేష్టలు భ్రమ, సంతాపము, మూర్ఛ, నిట్టూర్పు, జ్వరము, కలవరింత; మొదలగునవి.

ముగ్ధా కలహాంతరితా యథా

శ్లో. అనునయతి పతిం నలజ్జమానా
కథయతి నాఽపి సఖీజనాయ కించిత్

ప్రిసరతి మలయానిలే నవోఢా
వహతి పరంతు చిరాయ శూన్య మన్తః

గీ. అనునయింపదు లజ్జచే ౯ నతివ పతిని
జెప్పదు రవంతయేనియుఁ ౯ జెలులకయిన
మలయవాయువు వీవంగ ౯ మానసమ్మ
శూన్యమొనరించి చింతించె ౯ సుదతిచిరము.

మధ్యా కలహాంతరితా యథా.

శ్లో. విరమతి కథనం వినా న ఖేద
స్సతి కథనే సముపైతి కాఽపి లజ్జా
ఇతి కలహ మధోముఖీ సఖీభ్యో
లపితు మనాలపితుం సమాచకాంక్షే.

గీ. చెప్పికొనక తీరదు దుఃఖ ౯ మెప్పుడైనఁ
జెప్పఁబో సిగ్గు పైకొని ౯ చెప్పనీ ద
టంచు మోమువాంచుచుఁ గల ౯ హంబుఁజెలికిఁ
జెప్పుటకుఁ జెప్పమికిని వాం ౯ ఛించె లలన

ప్రౌఢా కలహాంతరితా యథా.

శ్లో, అకరోః కిము నేత్రశోణిమానం
కిముకార్షీః కరపల్లవా నిరోధమ్
కలహం కిమధాః క్రుధా రసజ్ఞే
హిత మర్థం, నవిదంతి దైవదష్టాః

గీ. ఏల తాల్చితి నేత్రమా ౯ యెఱ్ఱఁదనము?
చెలువుని న్నిల్పవై తేల ౯ చిగురుఁగేల?
నాలుకా! కలహించితి ౯ వేల? కినుకఁ
దెలియనేరరు మందభా ౯ గ్యులు హితమ్ము.

పరకీయా కలహాంతరితా యథా

శ్లో. భర్తు ర్న్యస్య కృతే గురు ర్లఘురభూ ద్దోష్ఠీ కనిష్ఠీకృతా
ధైర్యం కోశధనం గతం సహచరీ నీతిః కృతా దూరతః
నిర్ముక్తా తృణవ త్త్రపా పరిచితా స్రోతస్వినీ బిందువ
త్సక్రోధా దవధీరితో హతధియా మాత ర్బలీయా న్విధిః

మ. చనియెన్నచ్చెలి నీతి, పోయెఁద్రప, కోశద్రవ్యహానీలువుల్
జనియెన్; భక్తియడంగెఁ, బోయెను బ్రతిష్ఠావాంఛయున్, బిందువ
య్యెను స్రోతస్విని, యేవిభున్ గుఱిచి మున్నే వాఁడి దుర్బుద్ధిఁ గో
పనవై బిట్టు తిరస్కరించితిని దైవం బెంత కేనిన్ దగున్.

సామాన్యా కలహాంతరితా యథా

శ్లో. యత్పంకేరుహ లక్ష్మపాణికమలే భాగ్యాలయే యద్గురు
ర్న్యస్తం వా మమ యల్లలాటఫలకే భాగ్యాక్షరం వేధసా
తత్సర్వం సఖి యో యథార్థ మకరో త్తస్మిన్ ప్రకోపః కృతో
ధి ఙ్మాం! ధి ఙ్మమజీవితం! ధి గతనుం! ధిక్చేష్టితం! ధి గ్వయః!

ఉ. పాణిని బద్మచిహ్నమును భాగ్యమునన్ గురునున్కి ఫాలభా
గాన నదృష్టసూచకముగా లిఖియించు విరించి వ్రాఁతలన్
బూనియథార్థమున్ సలుపు పుణ్యుని దూఱితిఁ గోపగించితిన్
బ్రాణముఁ బ్రాయమున్ బనుల భావజునిన్ నను నోలిఁ గాల్పనే.

విప్రలబ్ధా యథా.

సంకేత నికేతనే ప్రియ మనవలోక్య సమాకులహృదయా విప్రలబ్ధా, అస్యాశ్చేష్టాః నిర్వేద నిశ్వాస సఖీజనోపాలంభ చింతా శ్రుపాత మూర్ఛాదయః
సంకేతస్థానమునందు ప్రియునిఁగానక హృదయమునఁబరితపించునది విప్రలబ్ధనాయిక యనఁబడును. విప్రలబ్ధ చేష్టలు నిర్వేదము నిశ్వాసము చెలికత్తెలను దూఱుట; చింత కన్నీరు గార్చుట మూర్ఛ మొదలగునవి.

ముగ్ధా విప్రలబ్ధా యథా

శ్లో. ఆలీభి శ్ఛపథైరనేక కపటైః కుఞ్జోదరం నీతయా
శూన్యం తచ్చ నిరీక్ష్య విక్షుభితయా నప్రస్థితం నస్థితమ్
న్యస్తాః కింతు నవోఢనీరజదృశా కుఞ్జోపకణ్ఠే తృషా
తామ్యద్భృంగ కదమ్బ డమ్బర చమత్కారస్పృశో దృష్టయః

ఉ. ఒట్టుల మోసగించి చెలు లొయ్యనఁ గుంజముఁ జేర్ప శూన్యమై
నట్టి తదంతరంబుఁ గని వ్యాకులయౌచు నవోఢ పోవ లే
కట్టెటులుండ లేకయు దృ పాలసభృంగ వితానకాంతులన్
దొట్టెడి చూపులం బఱపెఁ దొయ్యలి కుంజ సమీపభూమిపై.

మధ్యా విప్రలబ్ధా యథా

శ్లో. సంకేత కేళిగృహ మేత్య నిరీక్ష్య శూన్య
మేణీదృశో నిభృత నిశ్వసితాధరాయాః
అర్ధాక్షరం వచన మర్ధవికాసినేత్రం
తాంబూల మర్ధకబళీకృత మేవ తస్థౌ.

చ. మరుని విలాసకుంజమున మానసచోరుఁడు గానరామిచే
నిరవధికార్తయై నిభృత నిశ్వసితాధరయౌచు లేమ య
క్షరము సగంబె పల్కుచు వికాసము నేత్రములందు సగ్గమై
వఱలఁగఁ దమ్మలమ్ము సగభాగమె మ్రింగుచు నిల్చె నత్తఱిన్.

ప్రగల్భా విప్రలబ్ధా యథా

శ్లో. శూన్యం కుఞ్జగృహం నిరీక్ష్య కుటిలం విజ్ఞాయ చేతోభవం
దూతీ నాఽపి నివేదితా సహచరీ పృష్టాఽపి నోవా తయా
శంభో! శంకర! చంద్రశేఖర! హర! శ్రీకంఠ! శూలిన్! శివ!
త్రాయస్వేతి పరంతు పఙ్కజదృశా భర్గస్య చక్రే స్తుతిః.

చ. అరసి నికుంజమెల్లఁ బతిరానచ్చటఁ గాన కనంగు కైతవం
బరయుచు దూతితోఁ బలుక కాత్మసఖిన్ మఱి ముచ్చటింపకే
హర!హర! చంద్రశేఖర! శివా! శితికంఠ! ధనంజయాక్ష! శం
కర! ననుఁ గావుమా యనుచుఁ గంజవిలోచన వేఁడె భర్గునిన్.

పరకీయా విప్రలబ్ధా యథా

శ్లో. దత్వా ధైర్యభుజఙ్గమూర్ధ్ని చరణౌ వుల్లఙ్ఘ్య లజ్జానదీ
మఙ్గీకృత్య ఖలాన్ధకారపటలం తన్వ్యా న దృష్టః ప్రియః
సంతాపాకులయా తయాచ పరితః పాథోధరే గర్జతి
క్రోధాక్రాంతకృతాంతమత్తమహిషభ్రాంత్యా దృశౌ యోజితే.

మ. పదముల్ ధైర్యభుజంగ శీర్షమున మోపన్ జేసి, లంఘించి హ్రీ
నదిఁ, జేపట్టి ఖలాంధకారపటలిన్, నాథుంగనన్ లేక, తా
మదనాగ్నిన్ దురపిల్లి, దండధరశుంభద్భట్యా సరభ్రాంతిచే
త దశాశావధిఘోషఁ బెట్టుఘను, సందర్శించెఁ బ్రాణార్తయై.

సామాన్యా విప్రలబ్ధా యథా

శ్లో. కపటవచన భాజా కేన చిద్వారయోషా
సకలరసికగోష్ఠీ వఞ్చితా వఞ్చితాఽసౌ
ఇతి విహసతి రిఙ్గద్భృఙ్గ విష్వక్ప్రచక్షు
ర్వికచ కుసుమ కాంతి చ్ఛద్మనా కేళికుఞ్జః.

గీ. సకల రసికుల వంచించు ♦ చతురవేశ్య
యొక్క కుటిలుని కపటోక్తిఁ ♦ జిక్కెననుచు
రటదళిదృగంతములఁ గంచు ♦ రమ్యకుసుమ
జాలరుచిమిషఁ, గేళికుంజంబు నగియె.

ఉత్కా

సంకేతస్థలం ప్రతిభర్తు రనాగమనకారణం యాఽఽలోచయతి సా ఉత్కా. అవధిదివ సానాగతపతికాయాం ప్రోషితభర్తృకాయాం నాతివ్యాప్తిః. తస్యాః భర్తుర వధిదివసే భవనాగమననియమఇతి సంకేతపదేన వ్యావర్తనాత్. అస్యాశ్చేష్టాః అరతి సంతాప, జృంభాఙ్గాకృష్టి కంపరుదిత స్వావస్థా కథనాదయః

సంకేతస్థలమును గూర్చి నాయకుఁడు రాని కారణ మాలోచించు నదియుత్క వత్తు నని నిర్ణయించిన దినమునకు భర్తరానట్టి ప్రోషితభర్తృకా నాయికయందీ లక్షణమున కతివ్యాప్తిలేదు. ప్రోషితభర్తృకయొక్క పతి నిర్ణయ దినమునకుఁదనయింటికి రావలసిన నియమముగాని సంకేతస్థలమునకుఁగాదు; కావున నిచ్చట సంకేతస్థలపద ప్రయోగము చేత, ప్రోషితభర్తృకా నాయిక కీ లక్షణముపట్టదు. (అనఁగా, ప్రోషితభర్తృకను సంకేతపదము చేత విడఁదీసినాఁడు) ఈయమ చేష్టలు అప్రీతి, జ్వరము, ఆవులింతలు, ఒడలువిఱుచుకొనుట, వణఁకు, విలాపము; తనదురవస్థను నితరులతోఁ జెప్పికొనుట మొదలగునవి.

ముగ్ధోత్కా యథా.

శ్లో. యన్నాద్యాఽపి సమాగతః పతి రతః ప్రాయః ప్రపేదే పరా
మిత్థం చేతసి చింతయంత్యపి సఖీం న వ్రీడయా పృచ్ఛతి
దీర్ఘం నశ్వసితం దధాతి చకితం న ప్రేక్షతే కేవలం
కిఞ్చిత్పక్వపలాండుపాండురరుచిం ధత్తే కపోలస్థలీం.

ను. పెఱచానకాదవులొందియుండఁగఁదగున్, ♦ విచ్చేయఁడ య్యోకామనో
హరుఁడంచెంచియు; సిగ్గుచే నడుగఁబోకాచేటి, మార్గంబుఁ ద
ద్దరునక్ జూడక వేఁడి యూర్పునొకయింత్రక్ వీడకే కొంచెమో
పరిపక్వంబగు నుల్లితెల్లఁదనమున్ ♦ బాటించెఁ జెక్కిళ్లపై

మధ్యోక్త్యా యథా

శ్లో. ఆనేతుం నగతా కిము ప్రియసఖీ? భీతో భుజఙ్గాత్కిము?
కుద్ధో వా ప్రతిషేధవాచి కిమసౌ ప్రాణేశ్వరో వర్తతే?
ఇత్థం కర్ణసువర్ణకైతక రజః పాతోపఘాతచ్ఛలా
దక్ష్ణోః కాపి నవోఢనీరజముఖీ బాష్పోదకం ముఞ్చతి

మ. చన లేదో చెలి తోడితేర దయితుఁ, గ్రొ సర్పంపు భీ యేమొ కే
ళి నిషేధోక్తులఁ బట్టియే యలిగి రాఁ లేదో, మనోనాథుఁడం
చనటం గర్ణసువర్ణకైతకరజః గ్రొ పాతంపు దంభమ్మునన్
గనులన్ నీటినిగార్చెఁ బద్మముఖి తత్కాంతామూర్తి కల్గాకుచున్.

ప్రౌఢోక్త్యా యథా

శ్లో. భ్రాతర్నికుంజ, సఖి యూథి, రసాల బంధో,
మాతస్తమస్విని, పితస్తిమిర ప్రసీద,
పృచ్ఛామి కిఞ్చిదితి, నీరధరాభిరామో
దామోదరః కథయ కిన్న సమాజగామ.?

గీ. అనుజ కుంజమ, ప్రియ బంధు గ్రొ వామ్రశాఖ,
తల్లి నిశి, తండ్రి తమ మ, మిత్రత్రంబ యూథి,
నీలనీరదసుభగుఁడౌ గ్రొ నీరజాక్షుఁ
డేలరాఁడో? దయన్ వచింయింప లేరె.

పరకీయోక్త్యా యథా

శ్లో. స్నాతం వారిదవారిభి, ర్విరచితో వాసో ఘనే కాననే,
శీతైశ్చందనబిందుభి ర్మనసిజో దేవ స్సమారాధితః,
నీతా జాగరణవ్రతేన రజనీ, వ్రీడా కృతా దక్షిణా,
తప్తం కిం న తపః స్తథాఽపి సకథం నాద్యాఽపి నేత్రాతిథిః?

చ. జలదము నీటఁ బల్పితిని గ్రొ స్నానము, దట్టపుఁగాననంబునన్
జలిపితినుస్కి, మారు నతిశైత్యపుగంధపునీటఁ బూజలన్
జలిపితి, జాగరంబు నిశిఁజల్పితి; దక్షిణ నిచ్చితిన్ దప్రపన్,
చెలువుని దర్శనమ్మునకుఁ గ్రొ జేయుదు నేతప మెట్టు లబ్బెడిన్?

సామాన్యోత్కా యథా

శ్లో. కథ న్న కాంత స్సముపైతి కుఞ్జ
మిత్థంచిరం చేతసి చింతయంతీ
ప్రాక్షాళయ న్నిష్పతదశ్రువారా
వారాఙ్గనా కాఽపి ధనాభిలాషాత్,

గీ. వత్తుఁబొదరింటి కనిరాఁడు ǂ ప్రాణకాంతుఁ
డనుచుఁ దలపోసి యెంతయు ǂ వనరి వనరి
పడపుఁ బడఁతి యొక్కర్తు ద్రవ్యంపుటాసఁ
బొడము కన్నీటఁ దడిపెను ǂ బొదరుటిల్లు.

వాసక సజ్జ

అద్య మే ప్రియవాసర ఇతి నిశ్చిత్య యా సురతసామగ్రీం సజ్జీకరోతి సా వాసక సజ్జా; వాసకో వారః; అస్యాశ్చేష్టాః, మనోరథ సఖీపరిహాస దూతీప్రశ్న సామగ్రీ సంపాదన మార్గవిలోక నాదయః.

నేఁడు నామనోహరుఁడు వత్తునన్న దినమని నిశ్చయించుకొని యేనాయిక రత్యుపకరణముల నాయత్తపఱచునో యా యమ వాసక సజ్జానాయిక;వాసకమనఁగా వారమని యర్థము. ఈ యమచేష్టలు, కోరికలు, చెలులను బరిహాసముసేయుట, దూతికను బ్రశ్నించుట, సంభోగమున కుపకరించు సామగ్రిని సమకూర్చుట మార్గమరయుట మున్నగునవి.

ముగ్ధా వాసకసజ్జా యథా

శ్లో. హారం గుమ్ఫతి తారకాంతి రుచిరం గ్రథ్నాతి కాఞ్చీలతాం
దీపం న్యస్యతి తత్ర కింతు బహుళంస్నేహం న దత్తే పురః
ఆలీనామితి వాసకస్య రజనౌ కామానురూపాం క్రియాం
సాచిస్మేరముఖీ నవోఢసుముఖీ కాచి త్సముద్వీక్షతే?

ఉ. వచ్చు విభుండు రాత్రికని ǂ వాసకసజ్జిక కూర్చు మేఖలన్;
గ్రుచ్చును నాణిముత్తెముల ǂ కోవలు; దీపముఁబెట్టి తైలమున్
బెచ్చుగఁబోయ దందులను; ǂ వ్రీడ మొగంబటు ద్రిప్పి నవ్వుచున్
జెచ్చెర గుప్తమా మదన ǂ చేష్టల కంతఁ బ్రతీక్ష సల్పెడిన్.

మధ్యా వాసకసజ్జా యథా

శ్లో. శిల్పందర్శయితుం కరోతి కుతుకా త్కల్హారహారిస్రజం
చిత్రప్రేక్షణ కైతవేన కిమపి ద్వారం ముహు ర్వీక్షతే

గృహ్ణాత్యాభరణం నవం సహచరీ భూషా జిగీషా మిషా
దిత్థం పద్మదృశః ప్రతీత్య చరితం స్మేరాననోఽభూ త్స్మరః.

మ. తననైపుణ్యము వెల్లడించు మిషచే తం గుచ్ఛనజ్జస్రజం
బును వేడ్కన్ బలుమాఱు చిత్రనిచయంబుం జూచు వ్యాజమ్మునన్
జను ద్వారాసకుఁ; జేట్యలంకృతి జిగీషాచ్ఛద్మఁ గొంగొత్తభూ
షను గైసేయు; మఱుంగు తత్సుదతి చేష్టల్ గాంచి యౌరా! నగెన్.

పరిగల్భవాసకసజ్జా యథా

శ్లో. కృతం వపుషి భూషణం చికురధోరణీ ధూపితా
కృతా శయన సన్నిధౌ క్రముకవీటికా సంభృతిః
అకారి హరిణీదృశా భవనసీత్య దేహత్విషా
స్ఫురత్కనక కేతకీకుసుమ కాంతిభి ర్దుర్దినమ్.

ఉ. మేన ధరించె భూషల, నంమేయ సుధూపము వేసెఁ గేశపా
శానకుఁ, బాన్పు సన్నిధికిఁ జక్కఁగఁ జేర్చెను నాకు వక్కలా
పైని గృహంబుఁ జొచ్చుచు నా వాసకసజ్జిక దేహకాంతి జాం
బూనద కేతకీకుసుమ భూతినొనర్చెను దుర్దినంబుగన్.

ఏతన్నాయికా చేష్టాసు మనోరథస్య ప్రథమోద్దిష్టత్వాత్ మనోరథ యథేతి ప్రతిజ్ఞాయత ముదాహరతి.

మనోరథో యథా

శ్లో. ఆవయో రంగయో ర్ద్వైతే భూయో విరహవిప్లవః
అద్వైతేచ స్మితంస్ఫీతం నస్యా దన్యోన్యవీక్షణమ్.

గీ. తలఁప మాదు గాత్రంబుల ద్వైతమేని
పరిమితియె లేని విరహవిప్లవము కల్గు
నింక నద్వైతపద్ధతి నెనఁగఁబోదు
వితతసుస్మిత మన్యోన్యవీక్షణంబు.

పరకీయా వాసకసజ్జా యథా

శ్లో. శ్వశ్రూం స్వాపయతి చ్ఛలేనచ తిరో ధత్తే ప్రదీపాంకురాన్
ధత్తే సాధకపోతపోతనినదై స్సాంకేతికం చేష్టితమ్
శశ్వత్పార్శ్వవివర్తితాఙ్గలతికం లోలత్కపోలద్యుతి
ర్వాఽపి క్వాఽపి కరామ్బుజం ప్రియధియా తల్పాంతికే న్యస్యతి.

ఉ. దీపపుఁగాంతిఁగప్పి, మిషఁ ॥ దేలిచె నత్తను నిద్ర, మేడలం
దా పసిపాపురాల నిన ॥ దాన్కటి నున్కినెఱ్ఱుంగఁజేసెఁ దా
నాపయిఁ బల్మఱంగలత ॥ నట్టిటుఁ ద్రిప్పి చలత్కపోలయై
యాపెకరంబు సెజ్జనిడె ॥ నావిభుబుద్ధిని నెచ్చు మెచ్చుటో

సామాన్యావాసకసజ్జా యథా

శ్లో. చోళం నీలనిచోళకర్షణవిధౌ చూడామణిం చుంబనే
యాచిష్యే కుచయోః కరార్పణవిధౌ, కాఞ్చీం పునఃకాఞ్చనీం
ఇత్థం చందనచర్చితైర్మృగమదైరఙ్గాని సంస్కుర్వతీ
తత్కిం యన్న మనోరథం వితనుతే వారేషు వారాఙ్గనా.

సీ. "నీలనిచోళంబు ॥ హేలమైఁ దివఁగోరఁ
జోళంబు యాచింపఁ ॥ జూచుదానఁ
జుంబనంబొనరింపఁ ॥ జూపనప్పట్టునఁ
జూడామణినిఁగోరఁ ॥ జూచుదానఁ
గుచకుట్మలంబులఁ ॥ గోళులుంపఁదలంపఁ
గాంచన కాంచినిఁ ॥ గాంక్షసేతు"
నెంతయును ధనాశ॥నిభ్బంగి మదియందుఁ
జింతించి చింతించి ॥ యంత మేన

గీ. గంధ మలమిన కస్తూరి ॥ కలయఁబూసి
యంగముల సంస్కరించుచు॥నట్టి వార
వనిత సంకేతదినముల ॥ వాంఛపడని
వస్తువొక్కటియును గానఁ॥బడదు జగతి.

## స్వా ధీ న ప తి క

సదా సామాతా ఽఽజ్ఞాకరప్రియతమా స్వాధీనపతికా ఆస్యాశ్చేష్టాః వన విహారాది మదన మహోత్సవ మదాహంకార మనోరథావాప్తి ప్రభృతయః.

సర్వకాలము నాయిక యొనరించు నభిప్రాయసహితమగు భ్రూసంజ్ఞలు మొదలగు వానిచే నా మెయభిప్రాయమును నాథుఁడెఱిగి తదనుకూలమగు కార్యముల నెఱవేర్చుచుండు నెడల నా నాయికను స్వాధీనపతికానాయికయని వ్యవహరించెదరు. ఈ మెయొక్క చేష్టలు ఉద్యానవనవిహారము మరుకేళిసంబంధమగు మదాహంకారము మనోరథమును నెఱవేర్చు కొనుట మొదలగునవి.

ముగ్ధా స్వాధీన పతికా యథా.

శ్లో. మధ్యే న క్రశిమా, స్తనే న గరిమా, దేహే న వా మక్షిమా,
శ్రోణౌ న ప్రథిమా, గతౌ న జడిమా, నేత్రే న వా వక్రిమా,
లాస్యే న ద్రఢిమా, న వాచి పటిమా, హాసే న వా స్ఫాతిమా,
ప్రాణేశస్య తథాపి మజ్జతి మనో మధ్యేవ కిం కారణమ్?

చ. నడుమునఁ గార్శ్యమున్, గుచముసనం గరిమత్వము, మేననందమున్,
నడకలమాంద్యమున్, నగవునన్ జతురత్వము, నాటఁ జేటయున్,
బలుకులనేర్పు, కన్నుఁ గవ వక్రిత, శ్రోణి బృథుత్వమున్, గనం
బడ వయినన్ రమించు విభు మానసమేటికొ నన్నె మెచ్చుచున్.

మధ్యాస్వాధీన పతికా యథా

శ్లో. యదపి రతిమహోత్సవే నకారో
యదపి కరేణ చ నీవిధారణాని
ప్రియసఖి! పతిరేష పార్శ్వదేశం
తదపి న ముఞ్చతి చేత్కిమాచరామి?

గీ. రతిమహోత్సవమున నే విరతిని దెల్పి
పోకముడిఁ బట్టి యెంత యడ్డాకయిడినఁ
బ్రాణనాథుండు మామకపార్శ్వతలము
వదలి పోఁడేమి సేయుదుఁ బద్మనయన!

ప్రౌఢా స్వాధీనపతికా యథా

శ్లో. వక్త్రస్యాధర పల్లవస్య వచసో లాస్యస్య హాస్యస్య వా
ధన్యానా మగవిన్దసున్దరదృశాం కాన్తస్తనోతి స్తుతిమ్
స్వప్నేనాఽపి న గచ్ఛతి శ్రుతిపథం చేతఃపథం దృక్పథం
కాఽప్యన్యా దయితస్య మేసఖి! కథం తస్యాస్తు భేదగ్రహః

మ. ధరఁ,గాంతుండగువాఁడు ధన్యయగు కాంతాపాళి స్మేరాననా
ధర వాక్సంస్తుతిఁ జేయు; నా ప్రియునకే తన్వంగి స్వప్నానను
జారదేనాఁడును దృజ్మనః పథములన్ శ్రోత్రాధ్వమం దట్టిచోఁ
దరుణీ! యీయన కెట్టులేర్పడెడు భేదజ్ఞాన మూహింపుమా!

## పరకీయా స్వాధీన పతికా యథా

శ్లో. స్వీయా స్సన్తి గృహే సరోరుహదృశో యాసాం విలాసక్వణత్
కాఞ్చీ కుణ్డల హేమకఙ్కణ ఝణత్కారో న విశ్రామ్యతి
కోహేతుస్సఖి? కాననే పురపథే సౌధే సఖీసన్నిధౌ
భ్రామ్యన్తీమపి వల్లభస్య పరితో దృష్టిర్న మాం ముఞ్చతి.

గీ. వలయ మేఖలా కుండల క్వణన నెసఁగు
స్వీయ లెందఱో ప్రియునింటఁ జెలఁగుచున్న
నింటఁ బురమందు వనిఁ, జెలి వెంటఁదిరుగు,
నన్నుఁ బెడఁబాయ దేటికో నాథుదృష్టి.

## వేశ్యా స్వాధీనపతికా యథా

శ్లో. స న్త్యేవ ప్రతిమన్దిరం మృగదృశో యాసాం సుధాసాగర
ప్రోతస్సూన్యత సరోజసున్దరచమత్కారాదృశో విభ్రమా
చిత్రం కిన్తు విచిత్రమన్మథకలానైశద్య హేతోః పున
ర్విత్తం చిత్తహరం ప్రియచ్ఛతి యువా మయ్యేవ కింకారణమ్?

మ. తతపీయూషపయోధిపూరవిలస చ్ఛాయామాంబుజాతచ్ఛవి
ప్రతిభాసుందరనేత్రలైన తరుణుల్ ప్రాప్తింప నింటింటిలో
రతిశాస్త్రాదుల కౌశలంబునకునై ద్రవ్యంబు నాకిచ్చుచు
న్నతికానందముఁ గొల్పునివ్విభుఁడు, కాఁతా! వింత యే హేతువో!

## అ భి సా రి క

స్వయ మభిసరతి ప్రియమభిసారయతి వా యాసాభిసారికా. అస్యా శ్చేష్టాః సమయానురూప వేషభూషణ లజ్జా-ప్రజ్ఞా నైపుణ్యకపటసాహసాదయ ఇతి పరకీయాయాః స్వీయాయాస్తు ప్రకృత ఏవ క్రమః, అలజ్యతా సంపాదకస్య శ్వేతాద్యాభరణ గ్రహణస్య స్వీయాభిసారికాయా మసంభవాత్.

నాయకుని యింటికి స్వయముగఁ బోవునదియు నాయకుని దనయింటికి రప్పించుకొనునదియు నభిసారికానాయిక. అభిసారిక రెండు విధములు 1 పరకీయాభిసారిక 2 స్వీయాభిసారిక. పరకీయాభిసారిక సమయానుకూలముగ భూషణముల వస్త్రములఁదాల్చి పరులు గుర్తింప కుండునట్లుగ నభిసరించునది. (ఇతరులు తన్నుఁ జూతురనెడి భయము; తెలివితేటలు; బొంకు; సాహసము మొదలగునవి కలిగి యుండును.) ఇంక స్వీయాభిసారికకుఁ బరులు కాంతురను భయకంపాదులతోఁ బని లేదు గావున కాలానుకూల వేషభూషణాదులఁ దాల్పక సహజమగు వేషభూషణము లను మాత్రమే దాల్చుకొనును.

ముగ్ధాభిసారికా యథా

శ్లో. దూతీ విద్యుదుపాగతా, సహచరీ రాత్రి స్సహాస్థాయినీ,
దైవజ్ఞో దిశతి స్వనేన జలదః ప్రస్థానవేళాం శుభామ్,
వాచం మాఙ్గలికీం తనోతి తిమిరస్తోమోఽపి ఝిల్లీరవై,
ర్జాతోఽయం దయితాభిసారసమయో ముగ్ధే! విముఞ్చత్రపామ్.

మ. మెఱపే దూతికవచ్చె, చేటి నిశయుం ◌ మేల్తోరి వెన్నంటె, వె
ల్వారిచే గర్జఘనుండు జోస్యుఁడు శుభ◌ప్రస్థానకాలంబు, ఝి
ల్లిరవాళి దిమిరంపుసంచయము పల్కెన్ మంగళాలాపముల్;
దటిసెన్ బత్యభిసారకాలము, నెలంతా! వీడ వీడంగదే!

మధ్యాఽభిసారికా యథా.

శ్లో. భీతాసి ఽనైవ భుజగాత్ పథి, మద్భుజస్య
సఙ్గే పునః కి మపి కమ్ప మురీకరోషి,
అమ్భోధరధ్వనిభి రక్షుభి తాఽసి, తన్వి!
మద్వాచి సాచివదనాఽసి, కి మాచరామి?

గీ. పథమునం బాములకు భయంపడవుగాని
నాభుజాలింగన మన వణంకెదేల?
జలధరధ్వని కదరవు ◌ సకియ! నాదు
మాటకున్ మాఱుమోమౌదు ◌ వేటికిట్లు?

ప్రౌఢాభిసారికా యథా

శ్లో. స్ఫుర దురసిజభార భఙ్గురాఙ్గీ
కిసలయ కోమల కాన్తినా పదేన
అథ కథయ కథం సహేత గన్తుం
యది న నిశాసు మనోరథో రథస్స్యాత్.

తే. గుబ్బపాలిండ్ల భరమునఁ ◌ గ్రుంగుమేనఁ
బల్లవమనోజ్ఞ మృదురుచా ◌ స్పదము పదముఁ
బఱపు నేలీల నడురేల ◌ మొరపనేల
రథము కాదేని నిజమనో ◌ రథము రమణి.

పరకీయా ఽభిసారికా యథా

శ్లో. రభసా దభిసర్తు ముద్యతానాం
వనితానాం సఖి, వారిదో వివస్వాన్
రజనీ దివసో, ఽన్ధకార మర్చి
ర్విపినం వేశ్మ, విమార్గ ఏవ మార్గః

గీ. వారిదము రవి, రాత్రియే పట్టపగలు,
కాడె సదనంబు కటికి చీఁకటియె వెలుఁగు,
నతివరో! విమార్గమె మార్గ మగును వేగ
నభిసరింపఁగ యత్నించు నతివల కిల.

జ్యోత్స్నాఽభిసారికా యథా

శ్లో. చన్ద్రోదయే చన్దన మఙ్గకేషు
విహాస్య విన్యస్య వినిర్గతాయాః
మనో నిహన్తుం మదనోఽపి బాణాన్
కరేణ కాన్తాన్ బిభరామ్బభూవ.

గీ. అమృతకరుఁ డుదయింపఁగా నంగకముల
గంధమలఁది నవ్వుచుఁ జను కలికి మనముఁ
గాటముగ వ్రేటు వేయంగఁ గరమునందు
విషమశరుఁ డూనె నవకాంద విశిఖములను.

తమిస్రాఽభిసారికా యథా

శ్లో. నాఽమ్బుజై ర్న కుముదై రుపమేయం
స్వైరిణీజన విలోచన యుగ్మమ్.
నోదయే దినకరస్య న చేన్దోః
కేవలే తమసి తస్య వికాసః.

గీ. దినకర నిశాకరోదయక్రమ్మునను గాక
చీఁకటిని మాత్రమే వికసించుఁగాన
స్వైరిణీలోక రుచిరలోచనయుగమ్ము
కమలకుముదోపమేయమ్ము గాదుచూడ.

## దివసాభిసారికా యథా

శ్లో. పల్లీనామధిపస్య పఙ్కజదృశాం పర్వోత్సవామన్త్రణే
జాతే, సద్మజనా మిథఃకృతమహోత్సాహం పురఃప్రస్థితాః
సవ్యాజం స్థితయో ర్విహస్యగతయో శ్శుద్ధాన్తమధ్యాన్తరే
యూనోస్స్విన్నకపోలయో ర్విజయతే కోఽప్యేషకణ్ఠగ్రహః.

మ. వరరాజాంగన లింటివారిఁ బిలువం బర్వోత్సవంబంచు వా
రరుగన్ గుంపుగ ముందె, సంతసముతో నాలో మిషన్ వెన్కయై
చిఱునవ్వున్ నగి, చేరి యంతిపురికిన్ స్విన్నంపుఁ జెక్కిళ్లతో
సరసుండున్, వగలాఁడి సల్పిన పరిష్వంగాప్తి వర్ధిల్లెడిన్.

శ్లో. లోలచ్చేలచమత్కృతి ప్రవిలసత్కాఞ్చీలతాఝంకృతి
న్యఞ్చత్కఞ్చుకబద్ధబన్ధురవలద్వక్షోజకుమ్భోన్నతి
స్ఫూర్జద్దీధితి విస్ఫురద్గతి చలచ్చామీకరాలఙ్కృతి
క్రీడాకుఞ్జగృహం ప్రయాతి కృతినః కస్యాఽపి వారాఙ్గనా.

ఉ. తూలెడు చేలపున్ హొయలతోఁ గలఝుంకృతి నొప్పుకాంచితోఁ
మేలినిచోళబంధమునమించు వలత్కుచకుంభపాళితోఁ,
గ్రాలెడుకాంచితో నడె స్ఫురద్గతితోఁ జలహేమభూషతో
వ్రాలెడు రో వెలంది ధనవంతుని కేళినికుంజభూమికిన్.

ముగ్ధాయా లజ్జాప్రాధాన్యేన, మధ్యాయా, లజ్జామదనసామ్యేన, ప్రగల్భాయాః ప్రాకాశ్యప్రాధాన్యేన, ధీరాయా ధైర్యప్రాధాన్యేనాఽధీరాయా అధైర్యప్రాధాన్యేన ధీరాధీరాయా ధైర్యా ధైర్యప్రాధాన్యేన జ్యేష్ఠాయాస్స్నేహాధిక్యప్రాధాన్యేన కనిష్ఠాయా స్నేహన్యూనత్వప్రాధాన్యేన, పరోఢాయాః సంగుప్తిప్రాధాన్యేన, ముగ్ధాయా ఇవ కన్యాయా అపి లజ్జాప్రాధాన్యేన, సామాన్యవనితాయాః ధనప్రాప్తిప్రాధాన్యేనా ఽష్టవిధనాయికావర్ణనమితి విశేషః.

ముగ్ధకుసిగ్గుప్రధానముగఁ జేసియు; మధ్యకుసిగ్గును మదనవ్యాపారాసక్తియును బ్రధానముగఁజేసియుఁ బ్రగల్భకుఁ దనహృదయమందలి యభిప్రాయమును దెల్లడించుట ప్రధానముగఁజేసియు ధీరకు (అనఁగా, తనకోపమును దానొనర్చెడి పనులవలన నూహించుకోఁదగురీతిని దెల్లడించునాయిక) ధైర్యమును బ్రధానముగఁ జేసియు. అధీరకు (తనకుఁగల కోపమును స్పష్టముగఁ జేష్టలచేతను మాటలచేతను దెల్లడించునది) అధైర్యము ప్రధానముగఁ జేసియు. (ఇక్కడ అధైర్యమనఁగా. తన కోపమును లోపల దాచుకోలేని తనమని తాత్పర్యము (ధీరాధీరకు) తనకుఁగల కోపమును బ్రకటించియుఁ బ్రకటింపనటుల చేష్టలచేతను మాటలచేతను బ్రకాశింపఁ జేయునది?. ధైర్యా ధైర్య

ములఁ బ్రధానముగఁ జేసియు జ్యేష్ఠకు నధికమైత్రి ప్రధానముగఁ జేసియుఁ గనిష్ఠకు నల్పమైత్రిని బ్రధానముగఁ జేసియుఁ, బరోఢకు (తనవ్యాపార మితరులెఱుంగకుండు నట్లుగ సంచరించుటను బ్రధానముగఁ జేసియు ముగ్ధానాయికకువలెఁ గన్యకును సిగ్గును బ్రధానముగఁ జేసియు: సామాన్యకు (వేశ్యకు) ధనమార్జించుటను బ్రధానముగఁ జేసియు నష్టవిధనాయికా నిరూపణము చేసినారని తాత్పర్యము.

## ప్రవత్స్యత్పతిక

శ్లో. ప్రస్థానం వలయైః కృతం ప్రియసఖై రస్రైరజస్రంగతం
ధృత్యా న క్షణమాసితం వ్యవసితం చిత్తే నగన్తుం పురః
యాతుం నిశ్చితచేతసి ప్రియతమే సర్వైస్సమం ప్రస్థితం
గన్తవ్యేసతి జీవిత! ప్రియసుహృత్సార్థం కిముత్సృజ్యతే.

చ. పతి చన నిశ్చయింపఁగనె కైపైనమునేసెను గంకణాలచే
హితులగు నశ్రువుల్ చనియె కనింపును నేగె క్షణంబునుండకే
మతిచనె మున్నె యీగతి సమంకబుగ నెల్లరుఁబోవ నేల జీ
వితమ! సుహృత్తతి న్విడితి కవెన్కఁని నీవును బోవలెంగదా.

ఇత్యాది ప్రాచీనగ్రన్థకారలేఖనాత్ అగ్రిమక్షణే దేశాన్తరనిశ్చితగమనే ప్రియసి ప్రవత్స్యత్పతికా ఽపి నవమీనాయికాభవితుమర్హతి తథాహి తస్యాః ప్రోషితపతికా విప్రలబ్ధోఽత్కఁసు నాఽన్తర్భావః, భర్తుస్సన్నిధివర్తిత్వాత్ నకలహా న్తరితాయా మన్తర్భావః కలహాభావాత్ పత్యురవమానితత్వాచ్చ నాఽపి ఖండితా యాం ప్రియస్యా న్యోపభోగచిహ్నితస్యా ఽ గమనాఽభావాత్ ప్రియాయాః కోపాభావదర్శనాత్ కాకువచన కాతరప్రేక్షణాది సూచితా న్తఃపక్షపాతదర్శనాచ్చ న వాసకసజ్జాయాం వారనియమాభావాత్ – సామగ్రి సజ్జీకరణాభావ నిర్వేదాది దర్శనాచ్చ నస్వాధీనపతికాయా మగ్రిమక్షణఏవ సంగతివిచ్ఛేదదర్శనాత్ నహి స్వాధీనపతికాయాః కదాచిదపి సంగతివిచ్ఛేదఇతి సంప్రదాయః వ్రజన్నపి స్వాధీన పతికయా నిరుధ్యతే ఽన్యథా భర్తరి స్వాధీనత్వైవ భజ్యేత నేహతథా, సర్వథా భర్తృ విదేశగమనాత్ కిఞ్చిన్నిర్వేదా శ్రుపాత నిశ్వాస వనవిహారాది మదన మహోత్సవ వ్యతిరేకదర్శనాచ్చ, నాఽప్యభిసారికాయాం, అభిసారోత్సవాభావాత్, అన్తస్తాప దర్శనాచ్చేతి యుక్తముత్పశ్యామః. లక్షణంతు యస్యాఃపతి రగ్రిమక్షణే దేశాన్తరం యాస్యత్యేవ సా ప్రవత్స్యత్పతికా; అస్యాశ్చేష్టాః కాకువచన కాతరప్రేక్షణ గమన విఘ్నోపదర్శన నిర్వేద సన్తాప సమ్మోహ నిశ్వాసబాష్పాదయః

"ప్రస్థానంవలయైః" ఇది మొదలగు ప్రాచీన గ్రంథకారుల లక్ష్యములచేత నుత్తరక్షణమునం దెవతెపెనిమిటి నిశ్చయముగ పరదేశమునకేగునో అట్టినాయికను ప్రవత్స్యత్పతికానాయికయని యందురు. ఈనాయిక పైని వివరించిన యష్టవిధ నాయికలలోఁ జేరదని నిరూపించుచున్నాఁడు. ప్రోషితభర్తృకకు; విప్రలబ్ధకు; ఉత్కంఠితకు; పతి సర్వదా సన్నిధియందే యుండును గావున వారలయం దీ నాయిక కంతర్భావము

లేదు. కలహించుట, పతిని దూఱుట మున్నగు ధర్మములు లేనందునఁ; గలహాంతరిత యందంతర్భావము లేదు. పరకాంతారతిచిహ్నములతోఁ బతి యింటికి రానందునను నీయమ యట్టి పతిపై నలుగుట మొదలగు కారణములు లేనందునను- అన్యాపదేశాదికాకుస్వరవికారాదులతోఁగూడిన మాటలనుట; బెదరినచూపులఁ జూచుట మొదలగువాని వలన హృదయమున ననురాగమున్నట్లు సూచితనుగుటచే ఖండితానాయిక యందంతర్భావము లేదు. అవధిదిననిర్ణయము లేకుండుట వలనను, రత్యుపకరణముల సంపాదించుట లేనందునను నిర్వేదాదు లుండుటచేతను వాసకసజ్జయందంతర్భావము లేదు. ఉత్తరక్షణమునందే కూడిక లేకుండుట వలన స్వాధీన పతికయందంతర్భావము లేదు. స్వాధీనపతికకు సర్వకాల సర్వావస్థలయందును బతి సమాగమ విచ్ఛిత్తి యుండదని సంప్రదాయము. భర్త ప్రయాణమై పోఁదలఁచిన స్వాధీనపతిక వలదని వారించినచోఁ బతి ప్రయాణ ముడుగును. అట్లుగ భర్త తన స్వాధీనముండుటఁ డేని యానాయిక స్వాధీనపతికయే గాదు. ఈనాయికపట్లనట్లుగాక. తలఁచినరీతి భర్త దేశాంతరమునకేగియేతీరును గావునను; నించుక నిర్వేదము, కన్నీళ్ళు విడుచుటయు, నిట్టూర్పులు విడుచుటయుఁగలదు గావునను: ఉద్యాన వన విహారాదులు మదనమహోత్సవము లేదు గావునను; నీపె స్వాధీనపతిక కానేరదు. అభిసారిక నాయికవలె సంచారము లేనందునను, హృదయతాపమున్నందు వలనను, అభిసారికానాయికయం దంతర్భావములేదు; అందుచే నీప్రవత్స్యత్పతికను నవమనాయికగాఁ జెప్పుట యుచితముగాఁ దలంచుచున్నాము. అగుచో నీనాయికకు లక్షణమేమనఁగా, ఏనాయికయొక్క పతి తలఁచిన రీతిగ నుత్తరక్షణమునందే దేశాంతరమున కేగునో యాయమ ప్రవత్స్యత్పతికానాయిక, ఈమె యొక్క చేష్టలు, కాకుస్వరయుక్తవచనములు; బెదరుచూపులు, ప్రయాణమున కంతరాయములగు పనుల నెదురుచూచుట; నిర్వేదమభినయించుట, సంతాపము, విలాపము, నిట్టూర్పులు విడుచుట, కన్నీరుగార్చుట మున్నగునవి.

ముగ్ధాప్రవత్స్యత్పతికా యథా

శ్లో. ప్రాణేశ్వరే కిమపి జల్పతి నిర్గమాయ
క్షామోదరీ వదన మానమ కిమాఙ్చకార
ఆలీ పున ర్నిభృత మేత్య లతానికుఞ్జ
మున్మత్తకోకిల కలధ్వని మాతతాన.

గీ. పయనమునుగూర్చి నాథుండు ॥ పలుకునంత
దిగులుఁగాంచి కృశోదరి ॥ మొగము వాంచె
నింతలోఁ బొదచాటున ॥ కేగి చేటి
సలిపె నున్మత్త పరభృత ॥ కలరవంబు.

మధ్యాప్రవత్స్యత్పతికా యథా

శ్లో. గన్తుం ప్రియే వదతి నిశ్వసితం న దీర్ఘ
మాసీత్ తదా నయనయో ర్జల మావిరాసీత్

ఆయుర్లిపిం పఠితు మేణదృశః పరంతు
ఫాలస్థలీం కిము కచస్సముపాజగామ.

గీ. పయనమనఁ బతి; శ్వాస హ్రస్వమయితోఁచె
నశ్రువుల్ వుట్టె నపుడు మృగాక్షి కనులఁ
గచము చనియెను నాయు రక్షరముఁ జదువ
ఫాలతలమున కనఁగ దైర్ఘ్యవారె నహహా.

శ్లో. నాయం ముఞ్చతి సుభ్రువామపి తనుత్యాగే వియోగజ్వర
స్తేనాఽహం విహితాఽఞ్జలి ర్యదుపతే పృచ్ఛామి తత్త్వం వద
తామ్బూలం కుసుమం పటీర ముదకం య ద్బన్ధుభి ర్దీయతే
స్యాదత్రైవ పరత్ర త త్కిము విషజ్వాలావలీ దుస్సహమ్.

మ. తనువున్ వీడిన; వీడదీ విరహసంతాపంబు స్త్రీజాతి, గా
న నినున్ వేడెదఁ గేలుమోడ్చి; నిజమున్ బల్కందగున్ గృష్ణ! యీ
యనుఁగుం జుట్టములిచ్చు చందనము వీడ్యంబున్ విరుల్ స్వఃపురిన్
మనలోకాన వలెన్ గలంచు నొకో శుంభత్కాలకూటాగ్నులై.

శ్లో. న్యస్తం పన్నగమూర్ధ్ని పాదయుగళం భక్తిర్విముక్తా గురౌ
త్యక్తా నీతి రకారి కిన్న భవతో హేతో ర్మయా దుష్కృతమ్
అజ్ఞానాం శతయాతనా నయనయోః కోఽపి క్రమో రౌరవః
కుమ్భీపాక పరాభవశ్చ మనసో యుక్తస్త్వయి ప్రస్థితే.

మ. సరసుండా! ఫణిమౌళిఁ బాదయుగమున్ సంధించితిన్ వీడితిన్
గురుభక్తిన్ నయమున్ ద్యజించితి మఱే క్రూరంపుఁ గార్యంబులన్
జరుపన్ లేదు భవన్నిమిత్తమునఁ బ్రస్థానం బొనర్తేని వా
విరినేత్రంబుల కబ్బు రౌరవము కుంభీపాకమా నాత్మకున్
బరువౌ యాతన లింద్రియంబులకు సంప్రాప్తించు నిక్కంబుగన్.

సామాన్యాప్రవత్స్యత్పతికా యథా

శ్లో. ముద్రాం ప్రదేహి వలయాయ భవద్వియోగ
మాసాద్య యాస్యతి బహిస్సహసా యదేతత్
ఇత్థంనిగద్య విగళన్నయనామ్బుధారా
వారాఙ్గనా ప్రియతమం కరయో ర్బభార

గీ. "నీవియోగా_ర్తి వలయంబు నిలువఁబోదు
కాన ముదిరిక నిమ్ము కంకణముకొఱక"
టంచు వెలయాలు ప్రియుని కరాబ్జయుగముఁ
బట్టుకొనె నశ్రువులు పింపుగట్టి కురియ.

కొండియుఁ బ్రకారాంతరమున నాయికా భేదములు,

అహితకారిణ్యపి ప్రియే హితకారి ణ్యుత్తమా

శ్లో. పతి శ్శయనమాగతః కుచవిచిత్రితోరస్థలః
ప్రసన్నవచనామృతైః పరమతర్పి వామభ్రువా
అచర్చి సుభగస్మితద్యుతిపటీరపంకద్రవై
రపూజి విలసద్విలోచన చమత్కృతై రమ్బుజైః.

తన కపకార మొనర్చినను బతికి మేలొనఁగూర్చునది యుత్తమ.

మ. పరనారీకుచ చిత్రితోరమునఁ దల్పంబెక్కు ప్రాణేశ్వరుం
బరమప్రీతివచోమృతంబులను నారీమాతల్లి దేలించె; భా
స్వరహాసాభపటీరపంక సలిలార్చల్ చేసె; సాకూత వి
స్ఫురదక్షిద్వయ చిత్రితాంబుజములన్ బూజించె బల్ ప్రౌఢయై.

మ ధ్య మ

హితాహితకారిణిప్రియే హితాహితకారిణీ మధ్యమా.

శ్లో. కాన్తే సాగసి కఙ్కకస్పృశితయా సాచీకృతగ్రీవయా
ముక్తాః కోపకషాయమన్మథశరకూ్రరాః కటాక్షాంకురాః
సాకూతే దరహాసకేసరవచోమాధ్వీకధారాలసా
ప్రీతిః కల్పలతేవ కాచన మహాదానీకృతా సుభ్రువా.

మేలొనర్చిన మేలు; కీడొనర్చినఁగీడు సేయునది మధ్యమ.

ఉ. దోసమొనర్చియుర్ విభుఁడెదోమిషఁగంచుకమాన, మూర్కొగం
బై సతి, మారతీవ్రనిశితాంబకకోప కషాయవీక్షలం
గీసె; నతండు వేడ, స్మిత కేసరవాఙ్మధుమాధురీఝరీ
భాసురహార్దకల్పలత వానికిఁ గానుకనిచ్చె మెచ్చుగన్.

అ ధ మ

హితకారిణ్యపి ప్రియే ఽహిత కారిణ్యధమా. ఏష్వైవనిర్నిమిత్తకోపా చండీత్యు ఖిధీయతే, అస్యా నిష్కారణకోపత్వా దధమైవ చేష్టా

శ్లో. ప్రస్థానే తవ యః కరోతి కమలచ్ఛాయం ముఖాంభోరుహే
శ్రీఖండద్రవధారయా శిశిరయా మార్గం పుర స్సిఞ్చతి
తస్మిన్ ప్రేయసి విద్రుమద్రవనదీ రంగత్తరంగభ్రమి
భ్రాన్తక్లాన్త సరోజ పత్రి సదృశా భూయోదృశా కుప్యసి.

భర్త తనకు మేలొనఁగూర్చుచున్నను అహితమాచరించునది మధ్యను. అకారణముగఁ గోపగించునేని యీ నాయికనే చండి యందురు, అకారణాగ్రహ మానుట వలన నీయము చేష్ట యధమముగానే యుండును.

ఉ. నీపయనంబునందుఁ దరుణీ! యెవఁడాస్యముఁ దమ్మినీడలం
దాపు, సుశీత గంధరస ధారల ముస్నెపథంబు ముంచు, నీ
వాపతిఁ గోపగింతు విది న్యాయమె విద్రుమ నీరవాహినీ
క్షేపతరంగ వృత్తములఁ జిక్కినపద్మసదృక్షవీక్షలన్.

విస్తరభియా ప్రత్యేక మేతాసా ముత్తమమధ్యమాధమభేదా నోదాహృతా.

ఇతి ద్వితీయ ప్రకరణమ్

గ్రంథవిస్తరభీతిచే నీముగ్ధాది నాయకలకు నుత్తమ మధ్యమాధమ భేదములను వివరముచేసి యుదాహరింపలేదు. కావున నింతతో నాయికా నిరూపణము ముగిసినది.

## సఖీ నిరూపణమ్

విశ్వాస విశ్రామకారిణీ పార్శ్వచారిణీ సఖీ అస్యా మణ్డనోపాలమ్భ శిక్షా పరిహాస ప్రభృతీని కర్మాణి-

నాయిక యొక్క నమ్మకమునకుఁ బాత్రమయినదియు నాయికతో సర్వకాలము వెంటనంటియుండు నదియుఁ జెలికత్తెయనఁబరఁగు. ఇది యొనర్చు పను లెవ్వి యనఁగ, నాయిక నలంకరించుట, నిందసేయుట; కామవ్యాపారముల నేర్పుట అపహాస్యముచేయుట (పరియాచకము లాడుట) లోనగు నవియని తెలియనగును,

మణ్డనం యథా

శ్లో. స్తనకనక మహీధరోపకణ్ఠే
ప్రియకరపల్లవ ముల్లస త్ప్రమోదమ్
రహసి మకరికామిషా ల్లిఖన్తీం
కమలముఖీ కమలై స్సఖీం జఘాన.

గీ. తన కుచసువర్ణ శిఖరి చెంగతలను బ్రియుని
హస్తపల్లవమును రహస్యముగఁ బత్ర
భంగమిషను రచించి యుత్సాహంగు చెలిని
కమలములచేత శిక్షించెఁ గమల వదన.

ఉపాలమ్భో యథా

శ్లో. పాన్థస్త్రీ ధ్వాన్తై ర్ముఖరితదిశ శ్శ్రేణయ స్తోయదానాం
ధారాపాతై ర్ధరణివలయం సర్వతః ప్లావయన్తి
తేన స్నేహం వహతి విపులం మత్సఖీ, యుక్తమేతత్
త్వం నిస్స్నేహో యదసి తదిదం నాథ మే విస్మయాయ.

చ. ఉఱుములచేత దిక్తటము ల్మొరయంగ వర్షధారలన్
ధరణితలంబు ముంచె జలదంబులు దానన స్నేహవిస్తృతిన్
బరంగెను నాయనుంగు సఖి భావ్యమ యయ్యెది; నీవు స్నేహమున్
దొరఁగుటఁ జూడ విస్మయము తోఁచును నాదు హృదంతరమ్మునన్.

శిక్షా యథా

శ్లో. సానన్ద మాలి! వనమాలి విలోకనాయ
నిర్గచ్ఛ కుంజమితి కిన్తు విచారయేథాః
ఝుఙ్కారిణో మధులిహో దివసే భ్రమన్తి
రాత్రౌ పున శ్చపల చఞ్చుపుటా శ్చకోరాః.

గీ. సకియ! వనమాలిఁ గన నికుంజమున కేగు
తైన నొకటి తలంపు మేమనఁగఁ బవలు
ఝుంకరించుచు మధుపముల్ సంభ్రమించుఁ
గ్రమ్మ నోర్విప్పికొని చకోరములు రేల.

పరిహాసో యథా

శ్లో. ఆగారభిత్తిలిఖితాసు నివేదయస్వ
కస్స ప్రమోదకో మూర్తిషు లోకభర్తుః
ఇత్థం సఖీజనవచః ప్రతిపద్య సద్య
స్సీతాస్మిత ద్యుతిభి రుత్తరయాఞ్చకార.

గీ. దేహళీ కుడ్యమందుఁ జిత్రింపఁ బడిన
పద్మనాభునిరూపముల్ పదిటిలోన
నేడవదియగు మూర్తి పేరేమటన్న
సఖుల కిడె నుత్తరము స్మితచ్ఛాయ సీత.

సఖ్యాః పరిహాసవత్ ప్రియస్యాపి పరిహాసోయథా.

శ్లో. భ్రూసంజ్ఞయా ఽఽదిశసి తన్వి సఖీం న వాగ్భి
రిత్థం విహస్య మురవైరిణి భాషమాణే
రాధా చిరాయ దశనవ్రణ దూయమాన
బిమ్బాధరం వదన మానమయాఞ్చకార.

చెలికత్తియ పరిహాసమొనర్చునటువలెనే నాయకుఁడపహాస్యము సేయుట కుదాహరణము.

గీ. కన్నుసన్నల శాసింతు - గాని చెలుల
నేల మాటాడవని నవ్వ - కృష్ణుఁగాంచి
పంటి గంటులఁ జిరపరిక్లిష్ట మైన
వాతెరఁ దనర్చు మోమును - వంచె రాధ.

ప్రియపరిహాసవత్ ప్రియాయా అపి పరిహాసో యథా

శ్లో. దివ్యం వారి కథం! యత స్సురధునీమౌళౌ, కథం పావకో
దివ్యం? తద్ధి విలోచనం కథమహి ర్దివ్యం? సచాఽఙ్గే తవ
తస్మాద్ద్యూతవిధౌ త్వయాద్యముషితో హారః పరిత్యజ్యతా
మిత్థం శైలభువా విహస్య లపిత శ్శమ్భు శ్శివాయాస్తు వః.

నాథుఁడు పరిహసించు నటువలెనే, భార్యయు, పరిహసించుట కుదాహరణము.

చ. సురనది నీదుమౌళిపయిఁ - జూపున నగ్నియు; మేనఁబాములున్
వఱలుట దివ్యమెట్లగుచు - బల్కుమ? ద్యూతమునన్ హరించు నా
సరమిడుమంచు హేలమెయి - శాంకరి నవ్వుచుఁబల్కఁ గేరు నా
హరుఁడు కృపాకరుండయి యహర్నిశమున్ మము నేలుఁ గావుతన్.

## దూతీ నిరూపణమ్.

దూత్యవ్యాపారపారజ్ఞతా దూతీ. తస్యా స్సంఘటన విరహనివేదనాదీని కర్మాణి.
(నాయకుని యనుసంధానము చేయుట మొదలగు) దూతికా వ్యాపారముల యందు నిపుణతగలది దూతియనఁబరఁగును. ఈ యమచేష్టలు నాయకునిఁ గూర్చుట నాయికయొక్క విరహవేదనాదికము నాయకుని కెఱింగించుట మొదలగునవి;

సంఘటనం యథా

శ్లో. అఞ్చతి రజని, రుదఞ్చతి
తిమిర మిదం, దూతి చఞ్చతి మనోభూః,
ఉక్తం న త్యజ, యుక్తం
విరచయ, రక్తం మన స్తస్మిన్

గీ. మానసము వల్లభుని యందు మరులు కొనియె
రాత్రి వచ్చెను జీకటి గ్రమ్ముకొనియె
స్మరుఁడు చెలరేఁగి మార్కొన సాఁగఁజొచ్చెఁ
దగిన దౌనఁటింపుమీ మాటఁ దప్పఁబోకు.

విరహనివేదనం యథా

శ్లో. చక్రే చన్ద్రముఖీ ప్రదీపకళికా ధాత్రా ధరామండలే
తస్యా దైవవశా ద్దశాఽపి చరమా ప్రాయ స్సముస్మీలతి
తస్మాత్త్వము శ్శిరసా న తేన సహసా శ్రీకృష్ణ! నిక్షిప్యతాం
స్నేహ స్తత్ర తథా యథా న భవతి త్రైలోక్య మన్ధం తమః

మ. సతి సృష్టింపఁబడెన్ ప్రదీపకలికాసచ్ఛాయాకృతిన్ ధాతచే;
ద్యుతిహీనంబయి యద్ది యంత్యదశ కుద్యోగించె నీదృగ్గతిన్
నతనై పల్కుచునుంటి స్నేహమిఁడు దానన్ వేగ లేకున్నచో
నతిగాఢంబగు నంధకారమగుఁ గృష్ణా! మూఁడులోకమ్ములన్.

నాయకనిరూపణమ్

శృంగార స్యోభయనిరూప్యత్వాన్నాయకోఽపి నిరూప్యతే. సచ త్రివిధః పతి రుపపతి ర్వైశికశ్చేతి.

శృంగార రసము నాయికా నాయకుల నిరువురంబట్టి నిరూపింపఁ దగినది, కావున నాయకుని లక్షణముఁగూడ నిరూపింపఁబడుచున్నది. నాయకుఁడు పతియనియు నుపపతియనియు, వైశికుఁడనియు ముత్తెఱంగులన్ బరఁగెడిని.

పతిస్వరూపము

విధివత్ పాణిగ్రాహకః పతిః యథా.

శ్లో. త్వం పీయూషమయూఖ ముఙ్చ్ఛ శిశిరస్నిగ్ధాన్ సుధాశీకరాం
స్త్వం భోగీన్ద్ర విలమ్బసే కిము ఫణాభోగై శ్శనై ర్వీజయ
త్వం స్వర్వాహిని కిఞ్చ సిఞ్చ సలిలై రజై శ్శిరీషోపమై
స్సేయం శైలసుతా కఠోరమహసః కాన్త్యా పరిక్లామ్యతి.

యథాశాస్త్రముగ వివాహమాడినవాఁడు పతియనఁ బడును. అందు కుదాహరణము.

చ. దిరిసెన పువ్వువంటి మృదు దేహము కల్గిన శైలకన్య భా
స్కరకిరణాళి డస్సె శశి! చల్లని స్నిగ్ధసుధాకణంబులన్

గురియు మహీ! విలమ్బమిఁక గూడదు వీవును మెల్లమెల్ల నీ
పరపుషణాళి విప్పి సురవాహిని! చల్లుమ వారిబిందులన్.

## పతిభేదములు

అనుకూల దక్షిణ ధృష్ట శఠ భేదాత్ పతిశ్చతుర్ధా.

అనుకూలుఁడనియు దక్షిణుఁడనియు ధృష్టుఁడనియు శఠుఁడనియుఁ బతిని నాల్గువిధముల విభజించిరి.

## అనుకూలుఁడు

సార్వకాలిక పరాఙ్గనా పరాఙ్ముఖత్వేసతి సర్వదా స్వీయాయా మను రక్తోఽనుకూలః, యథా

శ్లో. పృథ్వి! త్వం భవకోమలా, దినమణే! త్వం శైత్య మఙ్గీకురు
త్వం వర్త్మ! న్లఘుతాం ప్రియాహి, పవన!త్వం స్వేద ముత్సారయ
సాన్నిధ్యం శ్రియ దండకావన! గిరే! నిర్గచ్ఛ మార్గాద్బహిః
సీతాఽసౌ విపినం మయాసహ యతో నిర్గన్తు ముత్కణ్ఠతే.

సర్వకాల సర్వావస్థలయందు స్వీయయగు తనభార్యయందే యనురాగము గలిగి; పరస్త్రీపరాఙ్ముఖుఁడై యుండువాఁ డనుకూలనాయకుఁడు.

మ. ధరణీ! కోమలవై మెలంగుమిఁకమిత్రా! శైత్యముంబొందుమా
ధరమా! మార్గము నిమ్ము మారుతమ!స్వేదంబార్పు మార్గంబ!డ
గ్గరుమా పేరిమి, దండకావనము! వీఁ కన్ సన్నిధింబొందుమా
త్వర, నాతో నటవీస్థలంబునకు సీతాకాంత రాఁగోరెడిన్

సకల నాయికావిషయ సమసహజానురాగో దక్షిణః

శ్లో. ఏతత్పురస్ఫురతి పద్మదృశాం సహస్రే
మత్కిద్వయం కథయ? కుత్ర నివేశయామి
ఇత్యాకలయ్య నయనామ్బురుహే నిమీల్య
రోమాఞ్చి తేన వపుషాస్థిత మచ్యుతేన.

బహు భార్యాసక్తుఁడయ్యును; అందఱు నాయికలయందు సమానమైన వలపు గలవాఁడు దక్షిణనాయకుఁడు.

ఉ. మన్నికటంబునన్ గలరు మాన్యలు కాంతలు వేయిమంది; నా
కున్న వె కన్నులన్ని; యెటులోకని సొక్కుట నీవ పల్కుమా?
యున్నవదూతి యంచు నలిననాభుఁడు గన్నుల మూసి తా గగు
ర్పొన్న తనూరుహాప్రతతిఁ గూడిన మేనున నిల్చె నత్తఱిన్.

## ధృష్టుఁడు

భూయో నిశ్శంకకృతదోషోఽపి భూయో నివారితోఽపి భూయః ప్రశ్రయ పరాయణో ధృష్టః, యథా

శ్లో. బద్ధో హారైః కరకమలయో ర్ద్వారతో వారితోఽపి
స్వాపం జ్ఞాత్వా పునరుపగతో దూరతో దత్తదృష్టిః
తల్పోపాన్తే కనకవలయం ముక్త మన్వేషయన్వా
దృష్టో ధృష్టః పునరపి మయా పార్శ్వఏవ ప్రసుప్తః.

తనకాంత యెడల మాటిమాటి కపకారముగావించి నాయికచే మాటిమాటికి దిరస్కరింపఁబడిన వాఁడయ్యును; మాటిమాటికి నాయికయెడల వినయమునఁబ్రవర్తించు వాఁడు ధృష్టుఁడు.

చ. కరముల హారపంక్తులను గట్టితి ద్వారము వెల్వరించితిన్
బఱపుచు దూరదృష్టులను, స్వాపమెఱింగెనొ యేమొ వచ్చి నన్
దొరయక ప్రక్కఁబండెఁ గయి దొర్లినకంకణముల్ గ్రహింప నే
నరయఁగ సెజ్జయంచుకడనాతఁడు చేతికిఁ జిక్కె నెచ్చెలీ!

## శఠుఁడు

కామినీ విషయ కపటపటు శ్శఠః యథా.

శ్లో. మాలౌదామనిధాయ గణ్డఫలకే వ్యాలిఖ్య పత్రావళిం
కేయూరం భుజయో ర్నిధాయ కుచయో ర్విన్యస్య ముక్తాస్రజమ్
విశ్వాసం సముపార్జయన్ మృగదృశః కాఞ్చీనివేశచ్ఛలా
న్నీవీగ్రన్థి మపాకరోతి మృదునా హస్తేన నామభ్రువః.

తానాచరించిన రహస్యమును నాయికకుఁ దెలియకుండునటుల వంచనచేయుట యందు మిగుల నేర్పరియయినవాఁడు శఠుఁడు.

మ. శిరమందుంచెను దండ, గండమున వ్రాసెన్ బత్రరేఖాళి, భా
స్వరబాహాద్వయి నంగదంబులునిచెన్ బాలిండ్లపై హారముం
చె రహిన్ నమ్మకముంగడించె నటఁగాంచిన్ బెట్టు వ్యాజమ్మునన్
దరుణీ, నీవి నపాకరించె మృదుహాస్త ప్రౌఢిమల్ గ్రాలఁగన్.

ఆచారహానిహేతుః పతి రుపపతిః, యథా

శ్లో. శఙ్కాశృంఖలితేన యత్ర నయనప్రాన్తేన నవేక్ష్యతే
కేయూరధ్వని, భూరిభీతి చకితం నోయత్రవా శ్లిష్యతే

నోవా యత్ర శనై రలగ్న దశనం బిమ్బాధరః పీయతే
నోవాయత్ర విధీయతే చ మణితం తత్కింరతం కామినోః

సదాచారభంగమునకుఁ గారణ మగు పతి ఉపపతి (అనఁగాభర్తగాక, పర నాయకుఁడని యర్థము)

ఉ. జంకను సంకెలంబకుట సల్పఁ గపాంగవిలోకనంబులన్
సంకటమబ్బ సంగదపు సందడి కంచుఁ గవుంగిలింప, రా
తంకముచేత మోవిని రదంబుల నానకయేని, గోలరే
పొంకముఁ గాన రమ్మణితమున్ వినరాంత మేరి కింపగున్

ఉపపతిర ప్యనుకూలాదిభేదేన చతుర్విధః, పరంతు శఠత్వం నియత మనియత మితరత్

ఉపపతినిఁగూడ; అనుకూల, దక్షిణ, ధృష్ట శఠ భేదములచే, నాలుగురకముల విభజంచినారు, అయితే శఠత్వము మాత్రము నియతము, ఇతరములగు ననుకూల ధృష్ట దక్షిణ నాయకత్వము లనియతములని తెలియ నగును.

## వైశికుఁడు

బహుళవేశ్యోపభోగరసికో వైశికః, యథా

శ్లో. కాఞ్చీ కలక్వణిత కోమలనాభికాన్తిం
పారావతధ్వని విచిత్రిత కణ్ఠపాళిమ్
ఉద్భ్రాన్తలోచన చకోర మనఙ్గ రఙ్గ
మాశాస్మహే కమపి వారవిలాసవత్యాః

మిక్కిలి వేశ్యాసంభోగమునం దుత్సాహముగలవాఁడు వైశికుఁడు

ఉ. కాంచినిగల్గునాదమున గ్రాలెడు కోమలనాభికాన్తితో
నంచితసత్కపోత నినదాత్త విచిత్రిత కణ్ఠపాళితో
మించి భ్రమించు చూడ్కులనుమేల్మిచకోరయుగంబుతో బ్రకా
శించు ధనాంగనారతి విశేషముగోరెద నద్వితీయమున్.

వైశికస్తూత్తమ మధ్యమాధమ భేదాత్ త్రివిధః, దయితాయాః భూయః ప్రకోపే ప్యుపచారపరాయణ ఉత్తమః.

శ్లో. చక్షుః ప్రాన్త ముదీక్ష్య పక్ష్మలదృశ శ్శోణారవిన్దశ్రియం
నోచ్చై ర్జల్పతి నస్మితం వితనుతే గృహ్ణాతి వీటీం నవా
తల్పోపాన్తముపేత్య కిన్తు పులకభ్రాజత్కపోలద్యుతిః
కాన్తః కేవల మానతేన శిరసా ముక్తాస్రజం గుమ్ఫతి.

ఈ వైశికనాయకుఁడును ఉత్తమమధ్యమాధమ భేదము వలన మూఁడు విధములు. నాయిక యెన్నిపర్యాయములు కోపించినను దానికి సేవలొనర్చి వశపఱచుకొనుట యందాసక్తి కలవాఁడుత్తమవైశికుఁడు.

మ. నయనంబెఱ్ఱనిదమ్మి దీటగుటఁ గన్గొంటం దాను వీక్షించి ప
ల్లయినన్ బల్కఁడు నగ్గిగా, విడెముసేయంబోఁడు, నవ్వాంగహహో!
శయనోపాంతము మెల్లఁజేరి పులకాంకచద్గండపాళీద్యుతిన్
దయితుం డొంది లవంచి గుచ్ఛెడిని ముక్తామాలికన్ బూనికన్.

మధ్యమవైశికుఁడు

ప్రియాయాః ప్రకోపే కోపమనురాగం వా నప్రకటయతి చేష్టయా మనో భావం గృహ్ణాతి స మధ్యమః, యథా.

శ్లో. ఆస్యం యద్యపి హాస్యవర్జితమిదం లాస్యేన వీతం వచో
నేత్రం శోణసరోజకాన్తి తదపి క్వాఽపి క్షణం స్థీయతామ్
మాలాయాః కరణోద్యమో, మకరికారమ్భః కుచాభోగయో
ర్ధాపః కున్తలధోరణీషు సదృశ స్సాయ న్తనో దృశ్యతే

ప్రియకుఁ గోపము కల్గినప్పుడు తానుకోపపడక, అనురాగమును చూపక, యా యమచేష్టలచేఁ దన్మనోగత మెఱింగెడువాఁడు మధ్యమవైశికుఁడు.

చ. మొగమున నవ్వు కప్పడదు ౘ పుట్టదు పల్కుల సొంపు కంటకెం
పు గదిరె; నిప్పు డొండెడకుఁ ౘ బోయెదఁ గా కొగి దండ్రగువ్వఁ జ
న్నుగవను బత్రభంగమును ౘ నూల్కొలుపన్ దలకున్ సుధూప మే
యఁగడఁగు సాయపున్ సమయుకమాకతనన్; ధ్రువమంతియేయగున్.

అధమవైశికుఁడు

భయ కృపా లజ్జా శూన్యః కామక్రీడాయా మకృతకృత్యాకృత్య విచారోఽధమః, యథా

శ్లో ఉదయతి హృది యస్య నైవ లజ్జా,
నచ కరుణా, నచ కోఽపి భీతిలేశః
వకుళ ముకుళకోశ కోమలాం మాం
పునరపి తస్య కరే న పాతయేథాః

భయముగాని, దయగాని, సిగ్గుగాని లేనివాఁడును, రత్యాదుల యందిది యొనరింపవచ్చుననిగాని, యొనరింపరాదనిగాని విచారింపక వర్తిలువాఁడును నధముఁడు (ఉదాహారణము)

ఉ. పుట్టిననాటనుండియును ♦ బుట్టదు సిగ్గు భయంబు లేశమున్
బుట్టదు మానసమ్మునను, ♦ బుట్ట దొకింతయుఁ బ్రేమ వానికిన్;
ముట్టినఁ గందు నప్పొగడ ♦ మొగ్గలకోశ మటుల్ మనోజ్ఞు నె
నట్టి ననుం గృపన్ మరల ♦ నాతనిచేఁ బడఁద్రోయకమ్మరో!

మానీ చతురశ్చ శఠఏవాన్తర్భవతః మానీ యథా

శ్లో. బాహ్యాకూతపరాయణం తవవచో వజ్రోపమేయం మనః
శ్రుత్వా వాచ మిమా మపాస్య వినయం వ్యాజా ద్బహిః ప్రస్థితే
ప్రాతర్నీత విలోకనే పరిహృతాలాపే వివృత్తాననే
ప్రాణేశే నిపతన్తి హన్త కృపణా వామభ్రువో దృష్టయః.

మానియు జతురుఁడు నను నిరువురు నాయకులును శఠునియందంతర్భావమును బొందుదురు.

చ. మనము కఠోరవజ్రమగు ♦ మాటనృతంబను పల్కులన్ విన్
వినయము వీడె ఛద్మమున ♦ వీడె గృహంబును వచ్చె వేకువన్
గనుఁగొనఁ డేమి పల్కఁడు మొగంబటు పెట్టఁడ లేని నాథు మీఁ
ద నకట! దీనదృష్టులను ♦ దత్తరుణీమణి చొన్పె నమ్రయై.

చతురుఁడు

వాక్చేష్టా వ్యఙ్గ్య సమాగమ శ్చతురః

ఆద్యోయథా

శ్లో. తమోజటాలే హరిదన్తరాలే,
శాలే నిశాయా స్తవ నిర్గతాయాః
తటే నదీనాం నికటే వనీనాం
ఘటేత శాతోదరి క స్పహాయః?

సురతవ్యాపారమునందుఁ దనకుఁగల కోర్కెను మాటలచేతను జేష్టలచేతను, వ్యంగ్యముగా (స్పష్టముగా హృద్గతమును నివేదింపక) ప్రకటించువాఁడు చతురుఁడు ప్రథమోదాహరణము.

గీ. అనుపమ తమో జటాలదిగంతరమున
నడికిరేయిని వెడలు సంభ్రమమందు
నదుల దరులందు, ఘోరకాననములందు
నీకుఁ దోడెవ్వరగుదు రేనీరజాక్షి!

ద్వితీయోయథా.

శ్లో. కాన్తే కనక జమ్బీరం
కరే కిమపి కుర్వతి,
అగారలిఖితే భానౌ
బిన్దు మిన్దుముఖీదదౌ.

గీ. స్వర్ణజంబీర ఫలమును ప్రాణవిభుఁడు
చేతితోఁబట్టి గోటితోఁ జెనకుచుండ
దేహళీకుడ్యమందుఁ జిత్రింపఁబడిన
సూర్యబింబంబుపై నున్నఁ జుక్కబెట్టె లలన.

ప్రోషితః పతి రుపపతి ర్వైశికశ్చ భవతి.

ప్రోషితఃపతి ర్యథా.

శ్లో. ఊరూరమ్భా, దృగపికమలం, శైవలం కేశపాశో,
వక్త్రంచన్ద్రో, లపితమమృతం, మధ్యదేశో మృణాళమ్,
నాభిఃకూపో. వళిరపిసరిత్, పల్లవఃకించపాణి,
ర్యస్యా స్సాచే దురసి నకథం హన్త తాపస్య శాన్తిః.

పతియు నుపపతియు వైశికుఁడును ప్రియురాలిని వీడి దేశాంతరమున కేగిన ప్రోషితులగుదురు.

చ. అరఁటులు పెందొడల్ నయన మబ్జము నాఁచు సుకేశపాశమాఁ
గరతలమాఁ బ్రవాళము మృణాళంబగుఁ బద్మము నాభి బావియా
వళులు వలగ్నమా బిసము పల్కమృతంబగు, నారు వాఁక, యే
తెఱవకు దానిఁదాల్పక మదీశమియించునె తాపమక్కటా!

ప్రోషిత ఉపపతిర్యథా.

శ్లో. యాన్త్యా స్సర స్సలిలకేళి కుతూహలాయ
వ్యాజా దుపేత్య మయి వర్త్మని వర్తమానే
అన్తస్స్మితద్యుతి చమత్కృత దృక్తరఙ్గై
రఙ్గీకృతం కిమపి నామదృశ స్స్మరామి.

మ. జలకంబాడుతమిన్ సరస్సునకుఁ గంజాతాక్షి విచ్చేయఁ బోఁ
గలితచ్ఛద్మున్ఁడనై పథంబునను నేఁగాగానంగ రా నాపె కే
వల మంతస్స్మిత కాంతిచిత్రిత సుదృగ్వ్యాపారవీచీచ్ఛటన్
లలి నంగీకృతిఁ జూపె నేదొ? యది వాకొలఁయమ్మ భావించెదన్.

ప్రోషితో శైశికో యథా

శ్లో. అధృత పరిగళ న్నిచోళబన్ధం
ముషిత నకార మవక్రదృష్టిపాతమ్
ప్రకటహసిత మున్నతాస్యబిమ్బం
పురసుదృశ స్స్మరచేష్టితం స్మరామి.

గీ. పోకముడి విప్ప వలదను ♩ బుద్ధిలేక
వక్రహాదృష్టి పాతముల్ ♩ పఱపఁజోక
ప్రకటహాసితోన్నతాస్య బింబయగు గణిక
మదనువ్యాపార మెంచెద ♩ మనమునందు.

అనభిజ్ఞో నాయకో నాయకా భాసఏవ యథా

శ్లో. శూన్యే సద్మని యోజితా బహువిధా భఙ్గీ వనం నిర్జనం
పుష్పవ్యాజముపేత్య నిర్గత మథస్సారీకృతా దృష్టయః
తాంబూలాహరణచ్ఛలేన విహితౌ వ్యక్తౌచ వక్షోరుహౌ
వేత్తేనాపి నవేత్తి, దూతి కియతా యత్నేన సజ్ఞాస్యతి?

ఎంత సూచనచేసినను నాయిక భావమెఱుంగనేరనివాఁడు నాయకాభాసుఁడు గాని నాయకుఁడు కాఁడు.

మ. జనశూన్యంబగు నింటఁ జిట్టకములన్ ♩ సర్వంబు నేఁజేసితిన్
జని యుద్యానమునందుఁ బుష్పమిషఁ జం♩చద్దృష్టి సారించితిన్
బనిగాఁదమ్ములమిచ్చు వ్యాజమున నేఁ♩బాలిండ్లఁ బైవ్రేటితిన్
గనలేఁ డింతయు నాదుభావ మిటులై ♩నన్ దూతి యెట్లోగదే!

నచ నాయికాయా ఇవ నాయకస్యాపి తేభేదా స్సన్తీతి వాచ్యమ్; తస్యా అవస్థాభేదేన భేదాః, తస్యచ స్వభావభేదేన భేదా, ఇతి విశేషాత్. అనుకూలత్వం దక్షిణత్వం ధృష్టత్వం శఠత్వమితి చత్వారఏవ నాయకస్య స్వభావా ఇతి. అన్యథా ఽవస్థాభేదేన యది నాయకస్యాపిభేద స్స్యాత్ తదా ఉత్క- విప్రలబ్ధ ఖండితా ద్యోనాయకా స్స్వీకర్తవ్యాః; తథాచ సంకేత వ్యవస్థాయాం స్త్రీణా మనాగమనేఽ సంప్రదాయాత్ నాస్త్యనాగమశఙ్కా- ధూర్తత్వ మన్యోప భోగచిహ్నితత్వంచ నాయకానాం నతు నాయికానాం తాః ప్రతి తదుద్ఘాటనే రసాభాసాపత్తేః

నాయికకు నిర్ణయించిన భేదములన్నియు నాయకునకును నిర్ణయింపఁగూడదు ఆగుచో నాయికకు నవస్థాభేదము చేతను నాయకునకు స్వభావభేదముచేతను భేద నిర్ణయము చేయ వలయుననుట విశేషము. అనుకూల దక్షిణ ధృష్ట శఠత్వాది భేదములచే నాయకుని స్వభావములు నాల్గు విధములుగ నిర్ణయించిరి. అట్లుగాక యవస్థాభేదమును

బట్టి నాయకునకును భేదముకలుగునేని అప్పుడు ఉత్క; విప్రలబ్ధ; ఖండితాది నాయకుల నంగీకరింప వలసివచ్చును. అట్లంగీకరింతుమేని సంకేత స్థలమునకు నువిదలు రాకుండుట సంప్రదాయ విరుద్ధముగావున స్త్రీ రాకుండుటకుఁ గారణమే మాయను సందేహము పురుషునకిఁ గలుగదు. ఈ కారణముచే నుత్కనాయకుఁడులేఁడు. ధూర్తత్వము నన్యోపభోగచిహ్నితత్వమును నాయకులకేగాని నాయికలకులేవు; ఏల యన? స్త్రీలకు సయితము ధూర్తత్వాన్యోపభోగచిహ్నితత్వములను జెప్పుట రసాభాసము. గావున; విప్రలబ్ధ ఖండిత నాయకులని వేఱుగ లేరు.

## నర్మసచివుఁడు

తేషాం నర్మసచివః పీఠమర్ద విట విదూషక భేదా చ్చతుర్విధః.

ఆనాయకుల యొక్క క్రీడాసఖుఁడు పీఠమర్ద విట చేట విదూషక భేదముచేత నాలుగు విధములుగ విభజింపఁబడెను.

## పీఠమర్దుఁడు

కుపితస్త్రీ ప్రసాదకః పీఠమర్దః, యథా

శ్లో. కోయం కోపవిధిః ప్రియచ్ఛ కరుణాగర్భం వచో, జాయతాం
పీయూషద్రవ దీర్ఘికా పరిమళై రామోదినీ మేదినీ
ఆస్తాంవా, స్పృహయాళు లోచన మిదం వ్యావర్తయ స్తీ ముహు
ర్యస్మై కుప్యసి తస్య సున్దరి తపో, బృన్దాని వన్దామహే.

మ. కతమేమిరా! యిటు కోపగింతు, కరుణాగర్భంబుగాఁబల్కుమా
తతపీయూషరసంపు దీర్ఘికల నా త్తావిన్ విరాజిల్లుతన్
క్షితి; పోనిమ్మది గూడఁ; గోర్కెవడునక్షిన్ మాటికిన్ ద్రిప్పియే
కృతిఁ గోపింతువొ తత్తపోవితతికిన్ గేల్మోడ్తు నశ్రాంతమున్.

కామతన్త్రకలా కోవిదోవిటః, యథా

శ్లో. ఆయాతః కుముదేశ్వరో, విజయతే సర్వేశ్వరో మారుతో
భృఙ్గ స్స్ఫూర్జతి భైరవో, న నికటం ప్రాణేశ్వరో ముఞ్చతి
ఏతే సిద్ధరసాః, ప్రసూనవిశిఖో వైద్యోఽనవద్యోత్సవో
మానవ్యాధి రసౌ కృశోదరి కథం? త్వచ్చేతసి స్థాస్యతి!

కామవ్యాపార శాస్త్రమునందుఁ బ్రవీణుఁడు విటుఁడు

చ. విరహిభయప్రదుండు తొగ వేలుపువచ్చె, నశేషచేతనే
శ్వరుఁడు సమీరుఁడొప్పెసఁగు, షట్పదమున్ రొదసేయు, జీవితే
శ్వరుఁడు కురంగటన్ నిలిచె, వారలు సిద్ధరసుల్, సుమాస్త్రుఁడా
దరమున వైద్యుఁడై మనుచుఁ, దన్వి కుధామయ మెట్లునిల్వునో?

### చేటుఁడు

సంధానచతురశ్చేటః యథా

శ్లో. సా చన్ద్రసున్దరముఖీ సచ నందసూను
ర్దైవా న్నికుఞ్జభవనం సముపాజగామ
అత్రాన్తరే సహచర స్తరణౌ కఠోరే
పానీయపానకపటేన సరః ప్రతస్థే.

నాయికా నాయకుల కనుసంధానము చేయుటయందు నేర్పరి చేటుఁడు.

గీ. దైవవశమున రాధయు ♣ దానవారి
యొరమును జేర నంతలో ♣ వారిజాప్త
కరములు కఠోరమై పర్వ♣సరసి కేగె
సహచరుఁడు నీరుద్రావు మిషమునఁ గడంగి.

### విదూషకుఁడు

అంగాది వైకృతై ర్హాస్యకారీ విదూషకః, యథా

శ్లో. ఆనీయ నీరజముఖీం శయనోపకణ్ఠ,
ముత్కణ్ఠితో౽స్మి కుచకఞ్చుక మోచనాయ;
అత్రాన్తరే ముహురకారి విదూషకేణ
ప్రాత స్తన స్తరుణకుక్కుట కణ్ఠనాదః.

గీ. సరసిజాక్షిని నేమెల్ల ♣ శయ్యఁ జేర్చి
కంచుకవిమోచనోత్కంఠఁ ♣ గ్రాలుచుండ
నక్కటా! విదూషకుఁ డెంతో ♣ నక్కజముగ
కూసె వేఁబోకఁ దెల్పు కుక్కుటపుఁ గూఁత.

### సాత్త్విక భావములు

స్వేదః స్తమ్భో౽థ రోమాఞ్చః స్వరభఙ్గో౽థ వేపథుః
వైవర్ణ్య మశ్రు ప్రళయ ఇత్యష్టౌ సాత్త్వికామతాః

చెమట ప్రానుపాటు గగుర్పాటు గద్గదస్వరము వడఁకు వెలవెలబాఱుట, కంటి నీరు ఇంద్రియ వ్యాపారశూన్యత, యను నెనిమిదియు సాత్త్విక భావములని యెఱుంగ వలయును.

శ్లో. ఖేదో వాచి, దృశోర్జలం, కుచతటే స్వేదః, ప్రకమ్పో౽ధరే,
పాండు ర్గణ్డతటే తనౌ చ పులకప్రాప్తో, లయశ్చేతసి,

ఆలస్యం నయన ద్వయే, చరణయో స్తమ్భ స్సముజ్జృమ్భతే,
తత్కిం రాజపథే వ్రజేన్ద్రతనయః కృష్ణ స్త్వయాఽఽలోకిత.

సీ. పల్కులగద్గద ✻ స్వరముప్పతిల్లెను
నయనంబులను నీరు ✻ బయలువెడలె
స్వేదంబు కుచసీమఁ ✻ జెలువారెనెంతయు
నధరంబునన్మించె ✻ నదరుపాటు
గండస్థలంబులఁ ✻ బాండిమ మబ్బెను
మేనెల్లఁ బులకలు ✻ గానిపించె
తెచ్చుపాటొదవెడు ✻ నెచ్చునెమ్మదియందుఁ
గనుదోయి నలసత్వ ✻ మెనసెఁగరము

గీ. పాదములయందు మాన్ద్యపాటు ✻ ప్రబలిపోయె
రాజపథమున నెందేని ✻ వ్రజగణేశ
. పుత్త్రుఁడౌ నల్ల శ్రీకృష్ణమూర్తి దివ్య
దర్శనంబయ్యెనో నీకుఁ ✻ దరుణి! చెపుమ.

## శృంగార రస నిరూపణమ్

రతిస్థాయిభావ శృఙ్గారః, సద్వివిధః సంభోగో విప్రలమ్భశ్చ

రతియనఁగా సంభోగ విషయ కేచ్ఛారూప చిత్తవృత్తి విశేషము. అదిదేనికి స్థాయిభావమో యదిశృంగారము. అశృంగారము సంభోగమనియు; విప్రలంభమనియు రెండుతెఱఁగులని తెలియనగును.

## సంభోగము

విలాసినో స్సయుక్తయో ర్దర్శన స్పర్శనాది స్సంభోగః; యథా

శ్లో. వియతి విలోలతి జలద
స్స్ఖలతి విధుశ్చలతి కూజతి కపోతః
నిష్పతతి తారకాతతి
రాన్దోళతి వీచి రమరవాహిన్యాః

ఒకచో సమావేశమయిన విలాసవతులగు నాయికా నాయకుల దర్శనాదికము సంభోగమనఁ బరఁగుచున్నది. ఎట్లన

గీ. గగనమెంతయు నసియాడఁ ✻ గంధరమ్ము
జాఱె విధుమండలమ్ము సం ✻ చలనమొందెఁ

బావురాల్ గూసెఁ దారకల్ ప్రపతనమొందెఁ
నిట్టునట్టూగఁ జొచ్చె మి న్నేటియలలు.

విప్రలంభము

కారణవిశేషేణ తయో ర్విశ్లేషో విప్రలమ్భః, యథా

శ్లో. ప్రాదుర్భూతే నవజలధరే త్వత్పథం ద్రష్టుకామాః
ప్రాణాః పఙ్కేరుహదళదృశః కణ్ఠదేశం ప్రయాన్తి
అన్యత్ కింవా తవ ముఖవిధుం ద్రష్టు ముడ్డీయ గన్తుం
వక్షః పక్షం సృజతి బిసినీపల్లవస్య చ్ఛలేన.

కారణవిశేషముచే నాయికపురుషులు నెడఁబాటు తటస్థించెనేని విప్రలంభ శృంగార మనఁబడును. ఉదా.

మ. నవమేఘోదయవేళఁ ద్వత్పథము గానంబోయెఁ బద్మాక్షి ప్రా
ణవితానంబటు కంఠదేశముఁ గన్యంబొందునేఁ దెల్పెదన్
భవదాస్యేందునిఁ జూడఁగా నెగిరిపోవన్ వక్ష మంభోజప
ల్లవదంభంబున సృష్టిచేసికొనె లీలన్ రెండు పక్షంబులన్.

విప్రలంభావస్థలు

విప్రలమ్భేచాభిలాష చిన్తా స్మృతి గుణకీర్తనో ద్వేగప్రలాపోన్మాద వ్యాధి జడతా నిధనాని దశాఽవస్థా భవన్తి

అభిలాష

తత్ప్రసంగమేచ్ఛాఽభిలాషః, యథా

శ్లో. తస్యాం సుతను సరస్యాం
చేతో నయనంచ నిప్పతితమ్,
చేతో గురు వినిమగ్నం,
లఘు నయనం సంప్లుతం భ్రమతి.

విప్రలంభావస్థయందును అభిలాష, చింత, స్మృతి, గుణకీర్తనము, ఉద్వేగము, ప్రలాపము, ఉన్మాదము, వ్యాధి, జడత, నిధనము, అనియెడి యవస్థలు పదియని యెఱుంగవలెను. ఆపది యవస్థలలో సంగమాభిలాష యభిలాష యనఁబడును.

గీ. పడిమె హృదయమ్ము నయనమ్ము పడఁతికొలన
మునిఁగిపోయెను భారమౌటను మనమ్ము
ఇంకనయనము లాఘవ మ్మెనయు కతన
నచ్చటనె తేలుచుం దిరుగ గాడఁజొచ్చె.

## చింత

సందర్శన సంతోషయోః ప్రికార జిజ్ఞాసా చిన్తా యథా

శ్లో. మయా విధేయో ముహు రద్య తస్మిన్
కుఞ్జోపకంఠే కలకంఠనాదః
రాధా మధో ర్విభ్రమ మావహన్తీ
కుర్వీత నేత్రోత్పల తోరణాని.

సందర్శన సంతోషములను గుఱించిన విచారణ చింతయనఁబడును.

గీ. ఇపుడు పొదరింటి చెంగటి కేఁగి నేనుఁ
గూయవలెఁ గూఁతఁ బలుమాఱు కోకిలవలె
రాధ మధుమాసవిభ్రమ భ్రమ వహించి
నయనములచేఁ దొగలతోరణములు గట్టు.

## స్మృతి

ప్రియాశ్రిత చేష్టాద్యుద్బోధిత సంస్కార జన్యం జ్ఞానం స్మృతిః.

శ్లో. రామో లక్ష్మణ,దీర్ఘ దుఃఖచకితో నావిష్కరోతి వ్యథాం,
శ్వాసం నోష్ణతరం జహాతి,సలిలం ధత్తే న వా చక్షుషోః,
వాతావర్త వివర్తమాన దహన క్రూరై రనఙ్గ జ్వరైః
క్షామః కిం తు విదేహరాజతనయాం భూయస్స్మరన్ వర్తతే.

తన ప్రియురాలి చేష్టాదులచేఁ గలిగిన సంస్కారము వలనఁ బుట్టిన జ్ఞానము స్మృతియనంబడును. (అనఁగాఁ బ్రియాచేష్టాదులను జ్ఞప్తి చేసుకొనుట స్మృతి యని భావము.

మ. చిరమౌదుఃఖమునన్ గలంగియు బయల్ సేయండు దానావ్యథన్
మఱి యుష్ణంబగు శ్వాసమున్ విడఁడు కంట్లన్ నీరు పెట్టండు ప
య్యెరసుళ్ళన్ బయలంటు చిచ్చుగతి నూటాడించు కామార్తులన్
గరమున్ జిక్కి స్మరించు రాముఁడెపుడున్ సౌమిత్రి భూపుత్రికన్.

విరహే కాన్తావిషయక ప్రశంసా ప్రతిపాదనం గుణకీర్తనమ్ తద్యథా
విరహ వేదనా సమయమునందుఁ గాంతనుగూర్చినస్తుతి గుణకీర్తనము.

శ్లో. స్పర్శ స్తన్నతటస్పర్శో, వీక్షణం వక్త్రవీక్షణమ్
తస్యాః కేళికథాలాప, సమయ స్సమయ స్సఖే.

గీ. సతత తత్కుచ స్పర్శమే స్పర్శమగును
వీక్షణంబనఁ దన్ముఖ వీక్షణంబ

సమయ మన్ననొ తత్కేళి 5 సత్కథాప్రి
సంగ సమయంబె నిక్కంబు 5 సంగడీఁడ!

## ఉద్వేగము

కామక్లేశ జనిత సకల విషయ హేయతా జ్ఞానముద్వేగః, యథా

శ్లో. గరళద్రుమకన్ద మిన్దుబిమ్బం, కరుణాహారిజ వారణోవసన్తః,
రజనీ స్మరభూపతేః కృపాణీ, కరణీయం కిమతః పరం విధాతః.

మదనబాధల వలన సకల పదార్థములయందుఁ ద్యజింపవలెననెడి బుద్ధి యుదయించుట యుద్వేగము, అదియెట్లన.

గీ. ఇందుబింబంబు విషవృక్ష 5 కందమాయె
నల వసంతుఁడు కరుణాబ్జ 5 హస్తియాయె
నంగజప్రభు కరవాల 5 మాయె తేయి
ఇంతకున్ మించి చేసెద 5 వేమిధాత?

## ప్రలాపము

ప్రియాశ్రిత కాల్పనిక వ్యవహారః ప్రలాపః, యథా

శ్లో. అద్యసంవీక్షణం చక్షు, రద్యసమ్మేళనం మనః,
అద్యసంస్పర్శనః పాణి రద్యమే కింకరిష్యతి?

ప్రియనుగూర్చిన కల్పిత వ్యవహారము ప్రలాపము, ఉదాహరణము

గీ. కన్నురెండవ వస్తువుఁ 5 గానఁబోదు
మనము మఱియొక్క వస్తువుఁ 5 మరఁగఁబోదు
చేయి వేఱువస్తువును స్పృ 5 శింపఁబోదు;
ఇంక నిర్వాహ మెట్టులో 5 యెఱుఁగనేను

## ఉన్మాదము

ఔత్సుక్యసంతాపాదికృత మనోవిపర్యాస సముత్థప్రియాశ్రిత వృథావ్యాపార ఉన్మాదః, స వ్యాపారః కాయికో వాచిక శ్చేతి ద్వివిధః,

శ్లో. ప్రతిఫల మమృతాంశోః ప్రేక్ష్య కాన్తో, మృగాక్ష్యా.
ముఖమితి పరిహాసం కర్తు మభ్యుద్యతోఽభూత్
అథ శిథిలిత వాచో మౌన మాశఙ్క్య తస్యాః
స్పృశతి పులకభాజా పాణిపఙ్కేరుహేణ.

నాయికా సమాగమముయొక్క కాలవిలంబము నోర్వలేక యందువలనఁ గలిగిన జ్వరాది బాధలచే నేర్పడిన చిత్తవైకల్యము వలనఁ గల్గిన భావ్యాసంబంధమైన వ్యర్థ ప్రసంగ మున్మాదము. అది కాయికమనియు వాచికమనియు రెండువిధముల వ్యవహరింపఁబడుచున్నది.

మ. అమృతాంశు ప్రతిబింబమున్ గనుచుఁ గాంతాస్యంబటంచాత్మ వే
డ్క మెయిన్ హాస్యమొనర్ప నద్ది యొకవాక్యంబైన మాటాడమిన్
భ్రమ శంకించెను మానమున్ గొనియె నానారీవతంసం బటం
చు మదిన్ దాఁకె గగుర్పుచెందిన సురోచుల్ గల్గుహ స్తంబునన్.

వాచికమునకు ఉదా

శ్లో. కిం రే విధో మృగదృశో ముఖ మద్వితీయం;
కందర్ప దృష్యసి దృగమ్బుజ మన్య దేవ;
ఝుంకార మావహసి భృఙ్గ తను ర్న తాదృక్;
కర్మాణి ధి జ్ఞ పున రీదృశ మీక్షణీయమ్.

మ హరిణాక్షీముఖ మద్వితీయ మవురా యబ్జారి! భావోద్భవా
గరువం బేటికిఁ బొందెదోయి? వినుమా! కాంతాసునేత్రాబ్జముల్
మఱి వేఱౌ; భ్రమరంబ! సేయకుము యుష్మర్ఝుంకృతుల్, గాదు నా
తరుణీరత్నముకాయ మట్టి దిసిచేతల్ మానుఁ డీ దృష్టముల్.

వ్యాధి

మదన వేదనా సముత్థ సంతాపకార్శ్యాదిదోషో వ్యాధిః యథా

శ్లో. కోదణ్డం విశిఖో మనో నివసతిః కామస్య, తస్యా అపి
భ్రూవల్లీ నయనాఞ్చలం మనసి తే వాస స్సమున్మీలతి;
ఇత్థం సామ్యవిధౌ తయోః ప్రభవతి; స్వామిన్ స్తథా స్నిహ్యతాం
తన్వానా తనుతాం కృమా దతనుతాం నైషా యథా గచ్ఛతి

మదన బాధచేతఁ గల్గిన సంతాపజ్వరము; కృశించుట మొదలగు దోషములు వ్యాధియనఁబడును.

చ. మనమునసుంట విల్లిషువు మారునకున్ గల; వింక భ్రూలతల్,
కనుఁగొన, నీమనంబునను గాపురమున్ సతికబ్బె; నిత్తెఱం
గున సతికిన్ సుమాస్త్రునకుఁగూడెను సామ్యము; స్వామి! యీకృశాం
గిని సతనుత్వ మొందనటు కేవలమైత్రిని నింపి ప్రోవుమా!

## జడత

విరహవ్యథామాత్రవేద్య జీవనావస్థానం జడతా, యథా

శ్లో. పాణి ర్నీరవకఙ్కణః, స్తనతటీ నిష్కమ్పమానాంశుకా,
దృష్టి ర్నిశ్చలతారకా, సమభవ న్నిస్తాణ్డవం కుణ్డలమ్,
క శ్చిత్రార్పితయా సమం కృశతనో ర్భేదో భవే, న్నోయది
త్వన్నామశ్రవణేన కోఽపి పులకారమ్భ స్సముజ్జృమ్భతే.

ప్రాణమున్నదని విరహవేదనచేత మాత్రమే తెలియు నవస్థ జడత.

చ. కదలవు, మ్రోయ వాపికరకంకణముల్ కుచసీమఁబైటయున్
జెదరదు, చూపు నిశ్చల కనీనిక యౌ, రవకమ్ము నాట్యసం
పదగన, దిట్టికార్ణ్యపుటవస్థను నీదగు పేరు వింటచేఁ
బొదలదయేని గగ్గురువు బోటికి బొమ్మకు భేదమేమగున్.

## దర్శనము

స్వప్న చిత్రసాక్షాద్భేదేన దర్శనం త్రిధా.

శ్లో. ముక్తాహారం నచకుచగిరేః, కఙ్కణం నైవహస్తాత్,
కర్ణా త్స్వర్ణాభరణ మపివా, నీతవాన్; నైవతావత్
అద్య స్వప్నే వకుళముకుళం భూషణం సందధానః
కోఽయం చోరో హృదయ మహరత్ తన్వి తం నప్రతీమః.

స్వప్నమునఁ జూచుట చిత్తరువునఁ జూచుట ప్రత్యక్షమునఁ జూచుట యని దర్శనము త్రివిధము.

చ స్తనగిరి హారమున్ శ్రుతుల స్వర్ణపు భూషల హస్త కంకణం
బును గయికోఁడు దాఁబొగడమొగ్గను భూషగఁ దాల్చి స్వప్నమం
దునఁ గనవచ్చి మ్రిచ్చిలెను దొంగయొకండు మదంతరంగమున్
వనరుహనేత్ర యాఘనుఁడెవండొ యెఱుంగ మొకింతయేనియున్.

చిత్రదర్శనమునకు, ఉదా.

శ్లో. నీవీం హరే, దురసిజం విలిఖే న్నఖేన,
దన్తచ్ఛదం చ దశనేన దశే దకస్మాత్,
ఇత్థం పటే విలిఖితం దయితం విలోక్య
బాలా పురేవ నజహార విహార శఙ్కామ్.

గీ. చిత్రలిఖితునిఁ బతిని వీక్షించి చెలువ
వాతెరం గంటుఁగొను నెల వంకలూన్చుఁ
జనుల, నీవినిసడలించు నను మున్ను
వలెనె, మరుని కేళికి భయంపడియె బాల

సాక్షాద్దర్శనమున కు, ఉదా

శ్లో చేత శ్చాఞ్చల్యతాం త్యజ; ప్రియసఖి వ్రీడే; న మాం పీడయ;
భ్రాత, ర్ముఞ్చ దృశౌ నిమేష, భగవన్ కామ; క్షణం క్షమ్యతామ్
బర్హం మూర్ధని, కర్ణయోః కువలయం, వంశం దధానః కరే
సోఽయం లోచనగోచరో భవతి మే దామోదర స్సున్దరః

చ. శిరమునఁబింఛమున్ శ్రుతులఁ జెన్నగు కల్వయుఁ జేత వేణువున్
సరగ ధరించి సుందరుఁడు నాకగుపించుచునుండెఁ గృష్ణుఁడే.
త్రిఁ మనమా! చలింపకుమ తిప్పలు పెట్టకు నన్ను వ్రీడ సో
దరుఁడ నిమేష! వీడుకనుఁదమ్ము లనంగ నిమేషమోర్చుమా.

పాఠాంతరము

సీ చిత్తమా! నీకింక సేవలుచేసెదఁ
జంచలత్వము వీడు కొంచెమిపుడు
బహుభంగులను నీవు బాధింపఁబోకమ్మ
చిన్నతనము చేతఁ జెలియ! వ్రీడ!
నేత్రంబులనువీడి నివసింపుమొందైన
నన్నయోయి నిమేష! మిన్న కిపుడు
స్వామి! మనోభవా! క్షణకాలమోపికఁ
బట్టి యేచకుమయ్య ప్రణుతు లిడెద.

గీ. శిరమునందునఁ బింఛంబుఁ జేత మురళి
చెవిని నుత్పలమును దాల్చి చెన్నుమీఱ
నందముల కిక్కయైన గోవిందుఁడదుగొ
కనులఁ గనుపడుచున్నాఁడు కలవుదీర.

శ్లో. మాధ్వీక స్యన్ద సన్దోహ సున్దరీం రసమఞ్జరీం
కుర్వన్తు కవయః కర్ణభూషణం కృపయా మమ.

గీ. మధురసస్యంద సందోహ మంజులంబు
మామకము రసమంజరి మానసేపుడు
కర్ణభూషగ ధరియింతు రాత సతము
నవరస రసాను భూతులౌ కవులు కరుణ.

శ్లో. తాతో యస్య గణేశ్వరః కవికులాలఙ్కార చూడామణిః,
ర్దేశో యస్య విదర్భభూ స్సురసరిత్కల్లోలకిర్మీరితా
పద్యైన స్వకృతేన తేన కవినా శ్రీభానునా యోజితా
వాగ్దేవీ శ్రుతి పారిజాత కలికా స్పర్ధాకరీ మఞ్జరీ.

చ. కవికులశేఖరుం డెవని గాదిలితండ్రి గణేశ్వరుం; డెవా
నివసతి, ప్రోల్లసత్సురధునీ ఝురపూత విదర్భదేశ; మా
సువిదితుఁడైన భానుకవి శ్లోకములన్ గ్రథియించె, భారతీ
శ్రవణ సుపారిజాత విలసద్రస మంజరిఁ గేరుమంజరిన్.

ఇది

శ్రీజగదీశ్వరీ చరణారవింద, మకరంద రసాస్వాద నేందిందిర
శ్రీమద్రాజ రాజేశ్వరీ స్మరణోపలబ్ధ ప్రసాద కవితా
వైభవామరవాద్యన్వవాయ నరసాంబికా సోమ
పీథినీ వేంకటప్పయజ్వతనూజాత హారితస
గోత్ర పవిత్ర శ్రీనీలకంఠ యజ్వ
ప్రణీతాంధ్ర రసమంజరి.

శ్రీ శ్రీ శ్రీ



# తప్పొప్పుల పట్టిక



| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 20 | వ్యాసజ్గ | వ్యాసజ్గ |
| 2 | 28 | యానసా | యావసా |
| 4 | 6 | క్రోడీ | క్రోడే |
| | 14 | శో | శ్లో |
| | 21 | ధైర్యే | ధైర్యే |
| 5 | 2 | ప్రశంస | ప్రసక్తి |
| | 12 | గావున | కావున |
| 6 | 15 | నదిధీర | నదియధీర. |
| | 35 | ప్రజతో | ప్రజతో |
| 8 | 19 | ప్రోష్ఠి | ప్రోష్ఠీ |
| | 23 | ద్వగ్వి | దృగ్వి |
| | 29 | విహిత | వివాహిత. |
| 10 | 14 | బరశీయ | బరకీను |
| 19 | 9 | భర్తబ | భర్తల |
| | 15 | దెవ్న | దెన్న |
| 35 | 13 | స్ఫూర్జి | స్ఫూర్జ |
| | 25 | ముగ్ఖ | ముగ్ధ |
| 37 | 5 | గూడీవ | గూడిన |
| 39 | 30 | భిదీయదే | భిదీయతే |
| 40 | 6 | మధ్యాను | మధ్యామ |
| 49 | 21 | తెజీవకు | తెలివకు; |
| 50 | 13 | స్పారీ | స్ఫారీ |
| 55 | 20 | భావము | భావము) |
| 5 | 2,3 సవరణ | బట్టునవియొంచి నిద్ర వోవంగ మానక దోచకయె లేమతికమకతో మెలంగ | |
| 7 | 4 | మగు | మరజా |
| 23 | 16 | జెప్పమానంగలేదు | వచింపలేదు |
| 34 | 10 | లకిల | కిలను |
| 49 | 21 | తెలివకు | తెలివకు; |